# శ్రీముఖలింగేశ్వర శతకము

[ శివమహిమ ]

(లఘుటీక, తాత్పర్య సంబంధ పురాణగాథా సహితము)




రచయిత :

మొసలకంటి వెంకటరమణయ్య

తెలుగు ఉపన్యాసకులు



తిరుమల తిరుపతి దేవస్థానము వారి ద్రవ్య
సహాయముతో ముద్రితము

ప్రథమ ముద్రణ ; 1000 ప్రతులు

ప్రకాశకులు ;

సిద్ధాశ్రమం, నరసన్నపేట

ముద్రణ :

తిరుమల తిరుపతి దేవస్థానము వారి
ద్రవ్య సహాయముతో

వెల ; అమూల్యము

ప్రతులకు ;

1. సిద్ధాశ్రమం
ఇందిరానగర్ కోలనీ
నరసన్నపేట.

2. ఎం. వి. రమణయ్య
తెలుగు ఉపన్యాసకులు
స్టేట్ బ్యాంకు వీధి (ఓల్డ్)
నరసన్నపేట - 532 421.



"ముక్తిదాయక సర్వేశ! భక్తవరద
అంగభవభంగ శ్రీ ముఖలింగవాస"



# అంకితము

తిరుమలేశుని అరుణారుణ చరణారవిందములకు

నా యీ చిన్నిప్రయత్నం సభక్తిపూర్వకముగా

సమర్పిస్తున్నాను.

రచయిత

# ముందుమాట

శ్రీశైల శిఖరం దృష్ట్వా తనుత్యక్త్వా2_ విముక్తకే
ముఖలింగ ముఖదృష్ట్వా పునర్జన్మ నవిద్యతే

శ్రీకాకుళం జిల్లాలోని సుప్రసిద్ధశైవ క్షేత్రం శ్రీముఖలింగం. పావన వంశధారానదీ తీరాన యిది వెలసినది, ఈ పవిత్రక్షేత్రం గంగ వంశీయుల యొకప్పటి రాజధాని నగరం. దీనికి రెండు కి.మీ. దూరాన గల " నగరికటకం " గ్రామం నాటి గంగవంశపు ప్రభువుల అంతఃపుర ప్రాంతంగా చారిత్రిక పరిశోధకులు గుర్తించిరి. " నగరి " అనగా రాజాంతఃపురము. ఈ ప్రాంతాన్ని పాలించిన తూర్పు గంగ వంశ రాజులలో 12వ శతాబ్దికి చెందిన అనంతవర్మ చోడగంగు సుప్రసిద్ధుడు అతడు తన రాజ్యాన్ని ఒరిస్సాలోని మహానది వరకు వ్యాపింపజేసెను. నాటినుండి అయనకు " ఉత్కళప్రభువ "ని " త్రికళింగాధిపతి " యని బిరుదులు వచ్చినవి.

భువనేశ్వరంలోగల మేఘేశ్వర, అనంతవాసుదేవ,దేవాలయాలు పూరీలో జగన్నాథస్వామి దేవాలయము, కోణార్క్‌లోగల సూర్యదేవాలయపు శిల్పములు గంగవంశ రాజుల కాలమునాటివి ఆ ఆలయముల శిల్ప సంపద శ్రీముఖలింగేశ్వర శిల్పసంపద యొక్కటిగానే గోచరించును.

శ్రీముఖలింగమునందు మూడు దేవాలయములు గలవు. ప్రధానాలయము తరువాత యూరివెలుపల పశ్చిమాభిముఖముగానున్న సోమేశ్వరాలయమును, తనకుష్ఠురోగ నివారణార్ధము చంద్రుడు ప్రతిష్ఠించినటుల ప్రసిద్ధిగలదు. పూర్వ గంగవంశమునకు చెందిన హస్తివర్మ క్రీ॥శ॥ 573 ప్రాంతమున యిచట పరిపాలన చేసెను. శ్రీముఖలింగేశ్వరాలయము ఆయనకాలములో నిర్మించినటుల మనకు చారిత్రక ఆధారములున్నవి 11వ శతాబ్దిలో అనంతవర్మ యీ ఆలయ నిర్మాణము చేపట్టినటుల మరికొంతమంది చారిత్రకులు అభిప్రాయ పడుచున్నారు, క్రీ॥శ॥ 573లో

హస్తివర్మ నిర్మించిన ఈ ఆలయమును అనంతవర్మ పునరుద్ధరణ చేసి యుండవచ్చును.

ఈ ఆలయపు గోడలపై గణపతి భైరవుడు మహిషాసుర మర్ధిని అర్ధనారీశ్వర శిల్పములు సర్వాంగ సుందరంగా మలచినారు. సున్నము రవ్వంతయైనను యుపయోగించిన జాడలేదు. యఱ్ఱరాళ్ళనుచెక్కి అమర్చి నారు. ఇది యిండో-ఆర్యన్ శిల్ప పద్ధతిలో నిర్మించబడినది. ప్రధానాల యమైన మధుకేశ్వరాలయ శిల్పకళ, భీమేశ్వరాలయము శిల్పకళలు యించుక భిన్నముగానున్నవి. కాన యివి యేక కాలమున నిర్మాణము కాలేదనుట సత్యము.

భీమేశ్వరాలయమును కుంతీ తనయుడైన భీముడు ప్రతిష్ఠించి నాడని ప్రతీతి. గంగవంశపు రాజైన రెండవ వజ్రహస్తదేవుడు యీ ఆలయ నిర్మాణము గావించినటుల తెలియుచున్నది ఇది 11వ శతాబ్ది యారంభ మున నిర్మించి యుండవచ్చునని చరిత్రకారుల యభిప్రాయము. ఇది చోళవంశపు రాజుల శిల్పకళవలె గోచరించుచున్నది. వేంగిచాళుక్య రాజగు శక్తివర్మ సోదరుడు విమలాదిత్యుడు యీ ఆలయ నిర్మాణమునకు తోడ్పడినట్లు చారిత్రక ఆధారములున్నవి.

ప్రధానాలయము చక్కని శిల్పసంపదతో విలసిల్లుచున్నది. ఆలయమునకు నాలుగు మూలలయందు నాలుగు చిన్న అలయములు వెలసియున్నవి. పశ్చిమ దిశయందుగల నాలయముపై మలచిన హరిహర బ్రహ్మము నాటి మత సామరస్యమునకు చేసిన ప్రయత్నముగా చెప్పవచ్చును. ఈ ఆలయ కుడ్యములపై శివలీలలు చెక్కినారు.

వారణాసి యానంద కాననముగాను శ్రీముఖలింగము గోవింద కాననముగాను వ్యవహరించుట గలదు. అందుచేతనే శ్రీముఖలింగము దక్షిణ కాశిగ ప్రశిద్దిచెందినది. శ్రీముఖలింగమునుగూర్చి స్కాంధ పురాణములో నొక యితిహాసము గలదు. వింధ్య గర్వమునణచుటకై అగస్త్య మహాముని కాశీనగరమును విడచివచ్చెను కాశీనగర వియోగమును

భరింపలేక ఆ మహాముని విచారగ్రస్తుడై యుండెను. ఆ సమయమున పరమేశ్వరనందనుడు, దేవసేనానియైన కుమారస్వామి ప్రత్యక్షమయ్యెను అగస్త్యునకు శ్రీముఖలింగక్షేత్ర మహాత్మ్యము దెల్పి యిదికాశీతుల్య మైనదని తెలిపెను.

కృతయుగములో గోవిందేశ్వరుడను పేర సువర్ణలింగముగను, త్రేతాయుగమున మధుకేశ్వరుడను పేర రజిత లింగముగను, ద్వాపరమున జంతీశ్వరుడను పేర కాంస్య లింగముగను వెలసిన పరమేశ్వరుడు కలియుగమున లింగమున ముఖముదాల్చి శ్రీముఖలింగేశ్వరుడై యీ పవిత్ర క్షేత్రమున వెలసినాడు. ఆకారణముననే దీనికి శ్రీముఖలింగమను నామము వచ్చినది,

ద్వాపరాంతము నాటికి నేటి శ్రీముఖలింగ ప్రాంతమొక చిక్కని అరణ్యప్రాంతము. మనోహరమైన వంశధారానదీతీర ప్రాంతము అందమైన యీ ప్రదేశమున పరమేశ్వరాంశ సంభవుడైన వామదేవమహర్షి యజ్ఞమాచరించెను. ( దీనికి సంబంధించిన కథను శతకమునందలి 6వ పద్యమున, 15వ పద్యమున చూడవచ్చును)

ఈ క్షేత్రము ననుసరించి యిచట పలుపుణ్యతీర్థములు వెలసినవి దక్షిణాయనగేభానౌ। శ్రావణె సితపక్షయోః; అష్టమీ వాయునక్షత్రే। పూర్ణిమా యిందువాసరే వైష్ణవర్షేతు సంయోగే జయంతీనగరేషుచ, తీర్థరాజ మహాయోగే షణ్ముఖోదేవ నిర్మితం" ఇవి ప్రాచీన కాలమున ఈ క్షేత్ర సందర్శనకు వచ్చిన ఋషులు మునీశ్వరులు, యోగులు ప్రతిష్ఠించినవి. శ్రీముఖలింగక్షేత్రము చుట్టు అనేక లింగములున్నవి. మంకణేశ్వరుడు, స్వప్నేశ్వరుడు, సూర్య ప్రతిష్ఠిత లింగము. సోమేశ్వరుడు, భీమేశ్వరుడు మొదలగునవి కొన్ని ముఖ్యమైన తీర్థములు. ఈ క్షేత్రమునకు తూర్పున రత్నగిరి గలదు. దానిపై విష్ణుమూర్తి, పద్మనాభస్వామి యను పేర వెలసియున్నారు, ఆయన యీ క్షేత్రపాలకుడు. దీనికి దక్షిణమున వటాద్రి గలదు. అచట మంకణేశ్వరుడు వెలసియున్నాడు. భీమేశ్వరునకు దక్షిణమున స్వప్నేశ్వరుడు యీయన దుస్వప్నవారకుడు.ప్రధానాలయము

హస్తివర్మ నిర్మించిన ఈ ఆలయమును అనంతవర్మ పునరుద్ధరణ చేసి యుండవచ్చును.

ఈ ఆలయపు గోడలపై గణపతి భైరవుడు మహిషాసుర మర్ధిని అర్ధనారీశ్వర శిల్పములు సర్వాంగ సుందరంగా మలచినారు. సున్నము రవ్వంతయైనను యుపయోగించిన జాడలేదు. యర్రరాళ్ళనుచెక్కి అమర్చినారు. ఇది యిండో-ఆర్యన్ శిల్ప పద్ధతిలో నిర్మించబడినది. ప్రధానాలయమైన మధుకేశ్వరాలయ శిల్పకళ, భీమేశ్వరాలయము శిల్పకళలు యించుక భిన్నముగానున్నవి. కాన యివి యేక కాలమున నిర్మాణము కాలేదనుట సత్యము.

భీమేశ్వరాలయమును కుంతీ తనయుడైన భీముడు ప్రతిష్ఠించినాడని ప్రతీతి. గంగవంశపు రాజైన రెండవ వజ్రహస్తదేవుడు యీ ఆలయ నిర్మాణము గావించినటుల తెలియుచున్నది ఇది 11వ శతాబ్ది యారంభమున నిర్మించి యుండవచ్చునని చరిత్రకారుల యభిప్రాయము. ఇది చోళవంశపు రాజుల శిల్పకళవలె గోచరించుచున్నది. వేంగిచాళుక్య రాజగు శక్తివర్మ సోదరుడు విమలాదిత్యుడు యీ ఆలయ నిర్మాణమునకు తోడ్పడినట్లు చారిత్రక ఆధారములున్నవి.

ప్రధానాలయము చక్కని శిల్పసంపదతో విలసిల్లుచున్నది. ఆలయమునకు నాలుగు మూలలయందు నాలుగు చిన్న ఆలయములు వెలసియున్నవి. పశ్చిమ దిశయందుగల నాలయముపై మలచిన హరిహర బ్రహ్మము నాటి మత సామరస్యమునకు చేసిన ప్రయత్నముగా చెప్పవచ్చును. ఈ ఆలయ కుడ్యములపై శివలీలలు చెక్కినారు.

వారణాసి యానంద కాననముగాను శ్రీముఖలింగము గోవింద కాననముగాను వ్యవహరించుట గలదు. అందుచేతనే శ్రీముఖలింగము దక్షిణ కాశిగ ప్రశిద్ధిచెందినది. శ్రీముఖలింగమునుగూర్చి స్కాంధ పురాణములో నొక యితిహాసము గలదు. వింధ్య గర్వముననచుటకై అగస్త్య మహాముని కాశీనగరమును విడచివచ్చెను కాశీనగర వియోగమును

భరింపలేక ఆ మహాముని విచారగ్రస్తుడై యుండెను. ఆ సమయమున పరమేశ్వరనందనుడు, దేవసేనానియైన కుమారస్వామి ప్రత్యక్షమయ్యెను అగస్త్యునకు శ్రీముఖలింగక్షేత్ర మహాత్మ్యము దెల్పి యిదికాశీతుల్యమైనదని తెలిపెను.

కృతయుగములో గోవిందేశ్వరుడనుపేర సువర్ణలింగముగను, త్రేతాయుగమున మధుకేశ్వరుడనుపేర రజిత లింగముగను, ద్వాపరమున జంతీశ్వరుడనుపేర కాంస్య లింగముగను వెలసిన పరమేశ్వరుడు కలియుగమున లింగమున ముఖముదాల్చి శ్రీముఖలింగేశ్వరుడై యీ పవిత్ర క్షేత్రమున వెలసినాడు. ఆకారణముననే దీనికి శ్రీముఖలింగమను నామము వచ్చినది,

ద్వాపరాంతము నాటికి నేటి శ్రీముఖలింగ ప్రాంతమొక చిక్కని ఆరణ్యప్రాంతము. మనోహరమైన వంశధారానదీతీర ప్రాంతము అందమైన యీ ప్రదేశమున పరమేశ్వరాంశ సంభవుడైన వామదేవమహర్షి యజ్ఞమాచరించెను. ( దీనికి సంబంధించిన కథను శతకమునందలి 6వ పద్యమున, 15వ పద్యమున చూడవచ్చును)

ఈ క్షేత్రము ననుసరించి యిచట పలుపుణ్యతీర్థములు వెలసినవి దక్షిణాయనగేభానౌ। శ్రావణె సితపక్షయోః; అష్టమీ వాయునక్షత్రే। పూర్ణిమా యిందువాసరే వైష్ణవర్షేతు సంయోగే జయంతీనగరేషుచ, తీర్థరాజ మహాయోగే షణ్ముఖోదేవ నిర్మితం " ఇవి ప్రాచీన కాలమున ఈ క్షేత్ర సందర్శనకు వచ్చిన ఋషులు మునీశ్వరులు, యోగులు ప్రతిష్ఠించినవి. శ్రీముఖలింగక్షేత్రము చుట్టు అనేక లింగములున్నవి. మంకణేశ్వరుడు, స్వప్నేశ్వరుడు, సూర్య ప్రతిష్ఠిత లింగము. సోమేశ్వరుడు, భీమేశ్వరుడు మొదలగునవి కొన్ని ముఖ్యమైన తీర్థములు. ఈ క్షేత్రమునకు తూర్పున రత్నగిరి గలదు. దానిపై విష్ణుమూర్తి, పద్మనాభస్వామి యను పేరవెలసియున్నారు, ఆయన యీ క్షేత్రపాలకుడు. దీనికి దక్షిణమున పట్టాద్రి గలదు. అచట మంకణేశ్వరుడు వెలసియున్నాడు. భీమేశ్వరునకు దక్షిణమున స్వప్నేశ్వరుడు యీయన దుస్వప్నవారకుడు. ప్రధానాలయము

నకు యుత్తరమున సూర్య ప్రతిష్ఠిత లింగము సూర్యతీర్థము గలదు ఈ తీర్థదర్శనముచే చర్మవ్యాధులు నయమగును. సిద్ధేశ్వర తీర్థము దర్శించిన సర్వసిద్ధులు గలుగును. వైశాఖ, కార్తీక, మాఘ మాసములలో యీ పవిత్ర క్షేత్రమును దర్శించిన భక్తులు పునీతలౌతారు. మహాశివరాత్రి తీర్థమిచట అయిదుదినములు జరుగును. ఈ పవిత్ర క్షేత్రమునుగూర్చి శ్రద్ధవాలినంత వహించుటలేదని దీని ప్రాచుర్యమును దేశము నలుమూలల ప్రచారమునకు తెచ్చిన యెడల యెుక్క ఆంధ్ర దేశమందేకాక దేశములోని పలుప్రాంత ములనుండి భక్తులను, యాత్రికులను ఆకర్షించ వచ్చునని యీ ప్రాంతీయుల భావన.

ఈ క్షేత్రమును నా చిన్నతనమునుండి పలుమార్లు దర్శించుట జరిగినది. కాని 1988లో నొక సారి నాదగ్గర బంధువులతో నీ క్షేత్రము దర్శించినపుడు స్థానిక పూజారులలో నొకరైన శ్రీ తమ్మా తిరుపతిరావు గారు నాకాసక్తి కలిగించి, దీనిగూర్చి మీరేమైన వ్రాయరాదా? అని ప్రోత్సహించిరి. ఆ శ్రీముఖలింగేశ్వరుడే వారి రూపమున నాకు ప్రేరణ కలిగించినటుల నాకనిపించినది. వెనువెంటనే నా మనమున ముక్తిదాయ కుడగు శ్రీముఖలింగేశ్వర పరబ్రహ్మముపై సీసపద్యము నందలి యెత్తు గీతిలో చివరి రెండు పాదములు మకుటముగా భాసించినది " ముక్తిదాయక! సర్వేశ భక్తవరద! అంగ భవభంగ శ్రీముఖలింగవాస! " వెనువెంటనే యీ శతక రచనకు పూనుకొని స్కాందపురాణము నందలి శ్రీముఖలింగ క్షేత్రమహాత్మ్యమును చూచుటయే గాక, పలుసార్లు శ్రీముఖలింగ క్షేత్రం దర్శించి అచట గల పలు అంశములను సేకరించి యీ రచన గావించితిని ఇందుదహరించిన శివమహిమకు సంబందించిన పలుగాథలు సామాన్య పాఠకులకు తెలియవలెననెడి. యూహతో యిందు లఘుటీక, సంబంధ పురాణకథలను చేర్చిన బాగుండునను అభిప్రాయము కలిగినది.

ఇంతదనుక వచ్చిన శతక వాఙ్మయమున యిట్టి ప్రయత్నము జరిగియుండలేదని నాభావన. ఎచ్చటనైన యెుందు రెండున్నయెడల మృగ్యము. దీనిని సహృదయతతో తిరుమల తిరుపతి దేవస్థానముల ప్రచురణ సంపాదకమండలి తమ ఆమోదమునుతెల్పి ముద్రణకు

ధనసహాయ మందించుట వలన యిది ముద్రణకు నోచుకొనినది. సాయీ ప్రయత్నమును సహృదయముతో స్వీకరించి నన్నాశీర్వదించ వలసినదిగా పాఠకులను కోరుచున్నాను.

తప్పుచేయుట మానవునివంతు, క్షమించుట దైవత్వము ఇందేవైన తప్పులున్న యెడల వాటిని విడచి, క్షీరమును గ్రహించి నీరమును విడచిన హంసవలె, మంచిని మాత్రమే స్వీకరింప గుణగ్రహణ పారీణులకు పాఠకులకు విన్నపము.



## సంస్మరణ

పసి తనమందే తల్లినిగోల్పోయిన నన్ను, మాఅక్కను అక్కున జేర్చుకొని, యనురాగాన్ని పంచియిచ్చి పెద్దజేసిన పిన తండ్రి కీ। శే। మొసలకంటి వెంకటసన్యాసయ్యగారి ఆత్మకు పరమేశ్వరుడు సదా శాంతిని ప్రసాదించుగాత!

రచయిత

శ్రీ మానాపగ్రగడ శేషశాయి
విశ్రాంత అధ్యక్షులు
మహారాజా సంస్కృతిక కళాశాల
విజయనగరం.

తే 27-7-90 ది

## రసతరగం

శ్రీముఖలింగేశ్వరుడు ప్రియతమ దైవం. వంశధారా వాస్తరంగాలలో ఓలలాడుతూ ఉంటాడు. ఏవారు తలుస్తారో ఏవేళ పిలుస్తారో అని నొసట కన్నుంచుకొని, దెసలు పరికిస్తూ ఉంటాడు. శివా అని స్మరిస్తే - విజయీభవ అని అందామని అత్రంతో-ఎదురు తెన్నులు చూస్తూ ఉంటాడు.

అలాంటి ఉబ్బలింగడిని ఆశ్రయించారు శ్రీ రమణయ్య, సీస పద్య శతకంలో పరమేశ్వరుని సంభావించారు. పలికిందెక్కడా పలుకుగా ఉండదు. శ్రీగంధం చిలుకులా శ్రీముఖలింగేశ్వరుడిని అలంకరిస్తుంది

వంశధారలాంటి ధార కవిత అందము హృదయంగమంగా ఉంది.

భవదీయుడు
(సం) మా. శేషశాయి

భాషాప్రవీణః పండితః
శ్రీ ఆరవెల్లి లక్ష్మీనారాయణాచార్యులు
కార్యదర్శి; ఉపనిషన్మందిరం రి॥ నెం॥ 5/54
సంస్కృతాధ్యాపకుడు
శ్రీశ్రీశ్రీ సూర్యదేవస్థాన ఆగమ పాఠశాల
( అరసవెల్లి )

శ్రీకాకుళం
తే30-10-95దీ

శ్రీమతే రవయేనమః

# ము న్నుడి

నమశ్శివాభ్యాం నవయౌవనాభ్యాం। పరస్పరాశ్లిష్ట వపుర్ధరాభ్యాం
నగేంద్ర కన్యా వృషకేతనాభ్యాం। నమోనమశ్శంకర పార్వతీభ్యామ్

మిత్రులు శ్రీ మొసలగంటి వెంకటరమణయ్య గారు రచించిన శ్రీముఖలింగ శతకమను శివమహిమాదర్శనమును జూచు భాగ్యమబ్బినది. భక్తిభావ సంభరితముగ, వీరి ప్రథమ ప్రయత్నమైనను ఈ శతకము పాఠకుల తలలూపించగలదని నమ్ముచున్నాను.

శ్రీకాకుళంజిల్లాలో పవిత్ర వంశధారానదీతీరముననున్న శ్రీముఖలింగ క్షేత్రమొకప్పుడు గాంగవంశ్యులైన గజపతి రాజుల రాజధానిగా నున్నట్లు చారిత్రకులయభిప్రాయం.

ఈ క్షేత్రమునకు జయంతీ క్షేత్రమను వ్యవహారమున్నట్లు క్షేత్రమహాత్మ్యముననున్నది. ఈ ప్రాంతమందలి శైవక్షేత్రములలో నిది అతిపురాతనమైనది. ఈ క్షేత్రమున మధూకేశ్వరస్వామి ఆలయము బహుశిల్పశోభితమై యలరారుచున్నది. మధూకేశ్వరునే శ్రీముఖలింగేశ్వర స్వామిగా వ్యవహరించుచున్నారు. మధూకమనగా ఇప్పచెట్టు. ఇచటి శివలింగము మధూక వృక్షమూలము నుండి ఆవిర్భవించుటచే మధూకేశ్వర లింగమనుట సార్థకము. నేటికిని దారురూపుడై స్వామి దర్శనమిచ్చుచుండుట ఆశ్చర్యజనకమగు భగవల్లీలయే.

శ్రీ .ఎం. వి. రమణయ్యగారు శ్రీముఖలింగ క్షేత్రమును కన్నులకు కట్టినట్లు వర్ణించుటతోపాటు, ప్రాచీనపురాణ ప్రసిద్ధములైన పెక్కు శివమహిమాద్యోతకములగు గాథలను సీసములలోరచించి, తన యభిజనమందును, సర్వలోకేశ్వరుడగు శ్రీముఖలింగేశ్వరుని యెడగల భక్తిని వెలార్చిరి.

పాఠకుల సౌకర్యమునకై లఘుటీక, పూర్వగాథలనుసైత మిందుచేర్చుట ముదావహము ఇందలి సీసములు పాఠకుని మార్గదర్శనము చేయుచు జయంతీ క్షేత్రమగు శ్రీముఖలింగ క్షేత్రవైభవము ననుభవింప జేసి, ఆనంద రసప్లావితులను చేయగలవనుట యతిశయోక్తిగాదు.

తన కవితా సరస్వతి సేలనాలుగు చెరగుల పవిత్రమొన ర్చుటకు గాను వీరిట్టి కృతులరచించి సుకృతులౌదురుగాక!

తిరుమల తిరుపతి దేవస్థానముల ద్రవ్యసహాయముతో నిది ప్రచురింపబడుట ముదావహము.

" జయంతితే సుకృతినః రససిద్ధాః కవీశ్వరాః "



**శ్రీ గెడ్డాపు సత్యం, ఎం. ఎ.**
విశ్రాంత ఆంధ్రభాషోపన్యాసకులు
ప్రభుత్వ కళాశాల
శ్రీకాకుళం.

మిత్రులు శ్రీ మొసలకంటి వెంకటరమణయ్య గారి శ్రీముఖలింగేశ్వర శతకమును అమూలాగ్రంగా చదివి మిక్కిలి ఆనందం చెందాను. శ్రీముఖలింగ క్షేత్రానికి చెందిన పలువిషయాలు ప్రస్తావించబడి సుమధురంగా వర్ణించబడ్డాయి.

సీసపద్యరచన ధారాళంగా విసుగు గల్గించని శైలిలో సాగింది. అష్టమూర్తియైన శివుని వివిధక్షేత్రములందు వివిధ నామధేయాలతో వెలయుభవుని వర్ణించు తీరు సుమనోహరంగా ఉంది. దీనిని చదివినందువల్ల అనేకములైన శైవగాథలు తలపునదోచి మిక్కిలి ఆనందాన్ని కలిగిస్తాయి. ఇటువంటి రచనలుచేసి శివుని కారుణ్యామృతాన్ని పొందగలుగుభాగ్యం కవిగారికి లభించుగాక

ఇట్లు
మిత్రుడు
గెడ్డాపు సత్యం



ఓం శ్రీ శ్రీనివాస పరబ్రహ్మణేనమః

# కృతజ్ఞతలు

శ్రీనివాసుని పాదసరసీరుహంబులకు జేజేలు. తిరుమలేశుని చరణారవిందములకు వరివస్య పద్మావతీవల్లభుని పాదపద్మములకు ప్రాంజలి. సప్తగిరీశుని పదసరోజములకు సాష్టాంగ వందనములు లక్ష్మీమనోహరుని పదకమలములకు జోహారులు. వేంకటేశుని యడుగుదమ్ములకు నేటికోళ్లు.

శ్రీ శ్రీ శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానములు ఆధ్యాత్మిక రచనలకందించు ద్రవ్యసహాయము లేనియెడల శ్రీముఖలింగేశ్వర శతకమను శివమహిమ పుస్తకము ముద్రణా భాగ్యమునకు నోచుకొని యుండదనుట సత్యము. ముందుగా తిరుమల తిరుపతి దేవస్థానముల యాజమాన్యమునకు నా కృతజ్ఞతాంజలి. అడగడుగున మార్గదర్శకులై, భయముతో వెనుకంజవేయు నన్ను వెన్నుతట్టి యీ రచన పూర్తియగుటకు నైతికబలము నందించిన శ్రీమాన్ అరవెల్లి లక్ష్మీనారాయణాచార్యుల వారికి నాహృదయపూర్వక కృతజ్ఞతాంజలి. నా శతకమును ఆమూలాగ్రముగవిని నా ప్రయత్నమునభివందించి, ధైర్యవచనములు పలికిన మా గురువర్యులు శ్రీ గంటి నరసింహశాస్త్రి గారికి (కలువరాయి బొబ్బిలి మండలం) నా కృతాజ్ఞతావందనములు. తిరుమల తిరుపతి దేవస్థానము వారి ద్రవ్య సహాయం అందడంలో మాజీ మంత్రి శ్రీ ధర్మాన ప్రసాదరావు గారు చేసిన కృషి శ్లాఘనీయం వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

మా శ్రేయోభిలాషి, బాల్యమిత్రులు శ్రీ టంకాల గోపాల కృష్ణగుప్తగారు, ప్రారంభంనుండి నన్ను ప్రోత్సహించి యీ రచన యీ స్థాయికి చేరడానికి కారకులు. వారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు. ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు కీ॥ శే॥ టంకాల శశిభూషణ గుప్తగారు నా అలసత్వాన్ని పోగొట్టి యనురాగంతో మొట్టమొదట అర్థిక సహాయాన్ని

అందించారు. ఈ శతకము ముద్రణ త్వరగా కావాలని ఆకాంక్షించారు వారీమధ్యనే పరమపదించారు. వారి ఆత్మకు శాంతి ప్రసాదించాలని శ్రీముఖలింగేశ్వరునికి నా భక్తిపూర్వక ప్రార్థన. శైవసంబంధమైన పురాణాంశాలను నేనుకోరినపుడు అందించిన మిత్రులు శ్రీ ఆర్.పి.ఎల్. స్వామి గారికి నా కృతజ్ఞతలు. నాపట్ల, నా కవిత్వంపట్ల, అనురాగాన్ని, అభిలాషను కలిగి నా సుఖదుఃఖాలలో పాలుపంచుకొంటున్న మిత్రులు శ్రీ సాధు చిన్నఅప్పలస్వామి గారికి సుహృదయాభివందన.

ఈ శతకం ప్రచురణకు ముందుకువచ్చిన సిద్ధాశ్రమం నరసన్నపేట నిర్వాహకులకు హృదయపూర్వక కృతజ్ఞతలు. భుజంతట్టి ముందుకు నడిపిన మిత్రులు శ్రీ జి. వి. కె. శ్రీరామమూర్తి గారికి సుహృదయ సద్భావన, ఆర్థిక సహాయన్ని అందించిన ఆఫీసర్సు క్లబ్బు నరసన్నపేట వారికి, శ్రీకాకుళం జిల్లా, రైసుమిల్లర్సు యసోషియేషను వారికి, సిద్ధాశ్రమ భక్తులకు నా వినయపూర్వక కృతజ్ఞతలు.

అచ్చు పుస్తకాలలో ముద్రారాక్షసాలుండడమనేది సర్వసామాన్యం. అయిన ప్రత్యేకశ్రద్ధ వహించి, సాధ్యమయినంత వరకు అచ్చుతప్పులు దొరలకుండ ముద్రించుటకు కృషి చేసిన శ్రీ శ్రీనివాసా పవర్ ప్రింటర్సు, నరసన్నపేట వారికి నా కృతజ్ఞతలు. ఈ శతకమునకు సర్వాంగ సుందరంగా అట్టను సమకూర్చిన శ్రీమాన్ పురాణపండా రాధా కృష్ణమూర్తి గారికి, శ్రీ వాసా వెంకటరమణమూర్తి గారికి (భాగవత మందిరం రాజమండ్రి) నా కృతజ్ఞతలు.

చివరిగా, అక్షరములను కూర్చి ముద్రించిన చిరంజీవులు తులసీదాసు, చిట్టిబాబు, శ్రీనివాసరావు లకు నా కృతజ్ఞతలు తెలుపకపోతే అది వెలితిగానే యుండిపోతుంది.

ఇట్లు
రచయిత

1. శ్రీకంఠ రజిత గిరినివాస! విశ్వేశ
లోకరక్షక దేవ శోకనాశ
మందరా చలధీర! మహితదివ్య ప్రభా
ఫాలలోచన కోటిభానుతేజ
సోమసూర్యాగ్ని సుశోభిత నేత్ర! ని
గమగోచర! శశాంక ఖండమకుట
హిమశైల జాధిప! హేమాద్రి ధన్వి! త్రి
పురనాశన! త్రిశూలి! భుజగహార
భక్తజనరక్ష నిఖిల సంపత్సమేత
పూతచారిత్ర మమ్మల బ్రోవవయ్య
ముక్తిదాయక! సర్వేశ భక్తవరద
అంగభవ భంగ శ్రీముఖ లింగవాస

2. విఘ్నరాజు దలచి వినుతిజేతు దొలుత
విఘ్నచయము బాపి విజయమొసగ
పలుకు పలుకు లందు నొలుక మాధుర్యంబు
పదసంచయంబులు పరుగులిడుచు
మంచిభావయుతపు మాటలు పలికింప
మొదవి వేల్పుసతికి మ్రొక్కులిడుదు
బుద్ధియందు నిలచి పూనిక సంపూర్తి
గావింపగొల్తును కార్తికేయు
శతకమొక్కటి సీసంపు సరులగూర్చి
యర్పణముజేతు నిలునాదు నాత్మయందు
ముక్తిదాయక సర్వేశ భక్తవరద
అంగభవభంగ శ్రీముఖలింగవాస

3. శ్రీ వారణాసి, నాశ్రిత రక్ష! శ్రీవిశా
లాక్షితో వేంచేసి యలరినావు
శ్రీశైల పర్వతశిఖరాన భ్రమరాంబ
దేవితో నెలకొంటి తీవిమీర
కాళహస్తి నిదేవి జ్ఞాన ప్రసూనాంబ
యలరింప చిన్మూర్తి వెలసినావు
శ్రీముఖలింగాన శీతాంశు ధర! యమ్మ
వారాహి తోడుగ వఱలినావు
పాపసంఘంబు లెడలించి పాలనయన
కలియుగంబున భక్తుల గావుమయ్య ॥ముక్తిదాయక॥

4. సుందర తరుగుల్మ శోభిత వంశధా
రానదీ తీర విరాజితంబు
కందమూలంబులు కాయధాన్యంబులు
శ్రీలు బండెడునట్టి క్షేత్రసమితి
కనులలరింపగ గూర్చు కమనీయ శిల్పసం
పదనొప్పు దేవతా సదనములును
ఘన సంపదలనీను కానన యుతములై
చెలువొందు పర్వత శ్రేణులమరు
మహిత శ్రీముఖలింగాన మహిమగాంచి
వెలసినాడవు కృపమీఱ వేద విశద ॥ముక్తిదాయక॥

5. గోకర్ణుడను పేరకుందనంబున తొలి
యుగమున వెలసితి యురగభూష
మధుకేశ్వరుండన మఱియుగంబున వెండి
మూర్తివై వెలసితి ముక్తిదాత

ద్వాపరంబున కౌంశ్య రూపము బూని, జ
యంతీశ్వరుడవైతి వఘ వినాశ
యాన నాబ్జము దాల్చి యవతార మందితి
కలివేళ యిచ్చోట కామదహన
పంక జాసను పూజిత భవ్యచరిత
భక్తమందార భసిత సర్వాంగపూత ॥ముక్తిదాయక॥

6. వామదేవుని యజ్ఞ భాగంబు గైకొన
వేంచేసి గంధర్వ బృంద మెల్ల
కండకావరమున కన్నుగానక భిల్ల
వనితల జెఱచిరి వక్రబుద్ధి
వామ దేవుడపుడు వారల శపియింప
భిల్లులై తిరిగిరి భీతిగొనుచు
ద్వాపరాంతము నందు వారాహిదేవితో
యిప్పచెట్టు మొదల యిచట వెలసి
ఆననాబ్జము లింగాన యమర దాల్చి
శాపమంతము జేసితి శైలచాప ॥ముక్తిదాయక॥

7. శ్రీకాల భైరవు భీకరరూప, ము
త్తర దిశాముఖమయి దనరుచుండ
దక్షిణాభిముఖియై ధనధాన్య వర్ధిని
వారాహి నీగుడి వఱలుచుండ
విఘ్నేశ్వరస్వామి వేంచేసి యుత్తర
ముఖముగా గొల్వుండి ముదముగూర్ప
కార్తికేయస్వామి యార్తజనావనుం
డపర దిక్కున గుడిం నలరుచుండ

బ్రహ్మలైదు గురౌన గూడ పంచధాత్ర
యుతము పావన తీర్థమై యెప్పెనిచట ।ముక్తిదాయక।

8. కార్త్తిక మాసపు కమలారి దినముల
సద్భక్తి నీపూజ సలుపువారు
మాఘ మాస బహుళ మహిత చతుర్దశి
జాగరణము జేయు సజ్జనాళి
కార్త్తిక మాసాన కంబదివ్వెలు నిల్పి
నీధ్యానమును జేసి నెగడు వారు
మంద వాసర యుక్త మహిత త్రయోదశి
నభిషేచనము జేయు నమల మతులు
మాన్య చరితులు జన్మంబు మరల గౌనరు
వారికిల శాశ్వతానంద పదవి గలుగు ॥ముక్తిదాయక॥

9. ప్రత్యూషమును భక్తి వంశధారానదీ
జలముల నియతిమై జలకమాడి
సుమతోయ పత్రముల్ సమకూర్చి గుడిసొచ్చి
విధ్యుక్త పూజల వినుతిజేసి
కాలభైరవు మహాగణనాథు వారాహి
పంచబ్రహ్మల భక్తిపరత గొల్చి
సోమ భీమేశ్వర స్వాముల దర్శించి
సద్భక్తి తీర్థ ప్రసాదములను
స్వీకరించిన వారికేవేళ నీప్సి
తార్థముల నిచ్చి రక్షించు దఘ వినాశ ముక్తిదాయక॥

10 పూర్వదిశాభాగ పుణ్యతీర్థము మాధ
వస్వామి క్షేత్రపు పాలకుండు
పద్మనాభస్వామి ప్రక్కనే దక్షిణ
మ్మున మంకణేశ్వరమూర్తి వెలసె
సప్తర్షీశ్వరుండు దుస్స్వప్న వారకుడు భీ
మేశ్వరుని సరస నిచట వెలసె
సూర్య ప్రతిష్ఠిత శుభ లింగ తీర్థము
త్వగ్రోగముల బాపు నుగ్రశరము
భవ్య తీర్థంబు లివ్విధి పాదుకొనట
వారణాసి తుల్యంబుగ వాసిగాంచె ॥ముక్తిదాయక॥

11 వంశధారానదీ పావన స్నానంబు
తన లింగదర్శన దనరజేయు
పంచబ్రహ్మల గొల్చి వారాహిదేవత
కుంకుమార్చన భక్తి కుదురజేయు
సోమేశ్వరస్వామి ధామము దర్శించి
తీర్థప్రసాదంబులర్థిగొనెడు
శ్రీ భీమనాథుని సేవించి ధ్యానించి
ప్రమథాదిగణముల భక్తిగొల్చు
మానవాళికితీరని మహిత కోర్కె
లుర్విగలవె సుజనపాల యురగహార ॥ముక్తిదాయక॥

12 ఒకవంక నెలవంక నకలంక ముగదాల్చి
ముకుట కిరణజాల మొకటి వెలుగ
దక్షిణ కరమందు దగపుఱ్ఱె ధరియించి
దాపట బూనిసు దర్శనంబు

గళసీమ కుడిపక్క కంకాళములు వేలి
ముత్యాల హారంబు మురువు సూప
ఫాలమందున నేత్రపద్మంబు బొలుపార
వక్షమందున కౌస్తుభంబు మెఱయ
హరిహరాద్వైతము దెలుప నాలయమున
వెలుగునీమూర్తినే గొల్చి వినుతిజేతు ॥ముక్తిదాయక॥

13 శ్రీజయంతీ పురచిన్మయ లింగంబు
పాపతతుల కాపు పరమలింగ
మక్షీణ భాగ్యంబు లందించు లింగము
ముక్తిజేకూర్చెడి మోక్షలింగ
మజుదేవతా కోటులర్చించు లింగము
వామదేవార్చిత భవ్యలింగ
మఖిల బ్రహ్మండనాయకు మహాలింగము
వంశధారా తీర ప్రథితలింగ
మమల శుభదాయకంబగు నాత్మలింగ
మీశ శ్రీముఖలింగమైయిలను వెలసె ॥ముక్తిదాయక॥

14 సతతమ్ము నీపూజ సద్భక్తిగావింతు
వీక కాపాడు మధూకలింగ
మరల పుట్టువునీక మన్నించి రక్షించు
తుహినాంశు మకుట మధూకలింగ
పాపముల్ తోల్గొత్తనేవుగా జేసితి
దురితముల్ బాపు మధూకలింగ
నానేరములనెన్ని నన్ను శిక్షింపకు
దురిత సంహార మధూకలింగ

చిన్మయానంద నీమూర్తి చిత్తమందు
జేకొని గొలుతు దివ్యమధూకలింగ ॥ముక్తిదాయక॥

15 చిత్రసేనుడు, భార్య 'చిత్తని' యామోద
మునుబొంది చిత్కళ మనువుగొనియె
అన్నికాలములందు వమరంగ బూచెడి
యిప్పశాఖలనిచ్చె నిరువురకును
చిత్కళ భక్తికి చిత్తమలరి కృప
కనకంపు విరులిచ్చి దనిపినావు
చిత్తిని యీర్ష్యను చిత్రసేనుడు చెట్టు
మొదలంట ఖండింప ముఖముదాల్చి
వెలసి శ్రీముఖలింగమన్పేర నొప్పి
భక్తులకు ముక్తి నందించు ఫాలనేత్ర ।ముక్తిదాయక।

16. సరివచ్చు ననవచ్చు సాక్షాత్తు కాశికి
వంశధారా గంగ వాటు కతన
ప్రతివచ్చు ననవచ్చు బహులింగయుత మౌట
వారణాసీ విభు వాసమునకు
ఎన వచ్చు ననవచ్చు ఘనముక్తి వాటికి
ముగ్దేందు ధర నీవు ముఖము దాల్చ
దొరవచ్చు ననవచ్చు వరయజ్ఞ వాటికి
వామదేవుని యాగ ధామమగుట
పంచ ధాత్రాయతనముగా వరలుగాదె
మోక్షధామము నీగుడి భుజగహార ।ముక్తిదాయక।

17. బహుతీర్థశోభిత పావన క్షేత్రము
శ్రీముఖలింగము మృత్యుహారము

కోటి తీర్థమునందు గోరి యెవ్వడు మాఘ
మాసము స్నానముజేసె, నతడు
కోటి తీర్థములందు గ్రుంకిడు భాగ్యము
సర్వాఘ చయ వినాశంబునందు
సోమేశు చంద్రుండు సుప్రతిష్ఠితుజేసి
కుష్ఠురోగను వాసి కూర్మి చనియె
భక్తి శ్రావణ హిమకరు వాసరముల
పూజలొనరించు వారికి పుణ్యమబ్బు ॥ముక్తిదాయక॥

18. శ్రీశైల గిరి పుణ్య శిఖరంబు దర్శింప
శివ సాంబ సాయుజ్య సిద్ధిగలుగు
స్వర్ణముఖరి వారి స్నాతుడై శ్రీకాళ
హస్తీశు దర్శింప నమరుముక్తి
విశ్వేశ దేవుని పీట వాసంబున్న
కైవల్య సంప్రాప్తి గలుగు నిజము
శ్రీముఖలింగాన నీముఖ దర్శన
భాగ్యము భక్తుల పాపహరము
యీశ నిగమాంత సంచార కృత్తివాస
భక్త జనపాల నీకివే వందనములు ।ముక్తిదాయక।

19. దృక్కర్ణధారి! నీ దివ్యనామ జపము
పాపచయమ్ముల బాపునయ్య
చంద్రార్ధ చూడ నీ స్మరణ మాత్రముచేత
నయమగు భవరోగ భయము లిలను
మన్మథాంతక నీదు మహిమలు గీర్తింప
దొలగును సర్వార్తి దుఃఖచయము

శైలజాధిప నీదు లీలలు బొగడంగ
తాపత్రయంబులు దరికిరావు
దానవాంతక విజిత కందర్ప నీదు
దివ్యపదములు గొల్చెద దేవదేవ ॥ముక్తిదాయక॥

20 సన్నుతించెద నీమహోన్నతి నేవేళ
యాతి బాధలు మాన్పి యీశ బ్రోవు
ప్రస్తుతించెద నీ ప్రభావంబు నేవేళ
గౌరీశ పాపిని గావుమయ్య
కీర్తింతు నేనీదు యార్తరక్షణ దీక్ష
సర్వమంగళ రూప సాకుమయ్య
సేవింతు నేవేళ శ్రీకంఠ నీపాద
రాజీవ యుగళము రక్షసేయు
పార్వతీ పతినాదు పాపంబు లెడల
జేసి నరకాన బడకుండ జేరదీయు ॥ముక్తిదాయక॥

21 శంభో! మహాదేవ! సర్వజ్ఞ! శంకరా
నందివాహనదేవ! నాగభూష
చంద్రార్థశేఖర! యింద్రాది సురవంద్య
చిద్రూప తవభక్త చిత్తచోర
సకల భువనకర్త! సంతతాగమ వేద్య
పాలితాఖిల భక్తజాల! శూలి
భసిత పాండురదేహ! గ్రసితహాలహాల
దేవగణార్చిత దివ్యపాద
పూత కైవల్యదాత! సంపూర్ణ విభవ
వందనంబులు నీపాద పద్మములకు ॥ముక్తిదాయక॥

22 ఎవ్వాని కరుణచే నీసృష్టి సకలము
వీక్షణ మాత్రాన పృధ్వి గలుగు
నెవ్వాని కరుణార్ద్ర దృక్కుల ప్రాణులు
పెంపొంది యీభువి పెరుగుచుండు
రెవ్వాని రౌద్రత యీసృష్టి జాలము
నంత మొందించు నత్యమిత శక్తి
యెవ్వాని నడవడి నెఱుగంగ నేరరు
బ్రహ్మాది దేవతా వర్గమింత
అట్టి సర్వాత్మ రూపుడ వాదిదేవ
సకల వేదాది గమ్య సంసార దూర ।ముక్తిదాయక।

21 విశ్వేశ రక్షించు విశ్వాత్మ కాపాడు
విశ్వాస పాత్రుల విశ్వదేవ
వేదవేద్య శరణు వేదాంత కీర్తిత
వేధాది దేవతా వినుత చరిత
ఆత్మగోచరదేవ! యవ్యక్త రూపకా!
యాద్యుండ మము బ్రోవుమాదిదేవ
దక్షయజ్ఞ ధ్వంస దయ జూడు మమ్మిల
దీన రక్షక దేవ! దేవదేవ
యంచు ననిశంబు నీపాద మాశ్రయించు
భక్తజనుల నేవేళ కాపాడుమయ్య ॥ముక్తిదాయక॥

24 సంసార దంతిని సమయింప కేసరి
తాపత్రయాగ్నిని బాప వృష్టి
పాప మేఘంబుల బాఱద్రోలగ వాయు
వాశాలతల గోయు నాయుధమ్ము

షడ్వర్గ తిమిరముల్ శమియింప భానుడు
దుఃఖాటవుల గాల్చు దుర్ఘరాగ్ని
రోగ నక్రము ద్రుంచ రూఢియౌ చక్రంబు
భవ కర్మ గిరులకు వజ్రమగుచు
తనరు నీనామ కీర్తన ధరణిలోన
కలుష సంహార శీతాంశు ఖండమకుట ॥ముక్తిదాయక॥

25 కఫము వాతము లంత్య కాలమందున గ్రమ్మ
మఱతునేమోనీదు మహిమ బొగడ
మరణకాలమునందు మమకార మొదవంగ
నీనామ కీర్తన సేరనేమొ
ముదిమిచే దేహంబు ముడుతలు వాఱంగ
మతిదప్పి నిన్నునే మఱతునేమొ
సంసార మీదుచు జరిగిన కాలంబు
విస్మరించితి మిమ్ము వేదవేద్య
చిత్తనైర్మల్య మొసగుము చిత్తజారి
[illegible]కెప్పుడు నీనామ భజనసేతు ॥ముక్తిదాయక॥

6 తరుణేందు శేఖర! తవనామ కీర్తన
ఘోరాఘ గిరితతి గూల్చుపవియె
గరళకంధర! నీదు ఘననామ భజనమ్ము
జన్మజన్మల కర్మచయము బాపు
శూలినీదగు దివ్యలీలల సంకీర్త
నము జరారుజలను నయముజేయు
భుజగభూషణ! నీదు భజన నిత్యముసేయ
కామాదిరిపులను గాల్చునదియె

ఈశ! పరమేశ! శితికంఠ! సృష్టికర్త
లీలభవమును కర్మంబు లేనివాడ ॥ముక్తిదాయక॥

27 కందర్పభంజన! కైలాసమందిర!
శంకరామహిమాఢ్య శరణు శరణు
వేదకౌలేయకా! వృషభ వాహనదేవ!
శరదిందు సుందరా! శరణు శరణు
భస్మాంగరాగ! యోభవ్యప్రభావ! యో
చంద్రార్ధ శేఖరా! శరణు శరణు
కాలకూటాశనా! ఖట్వాంగధర! మహే
శ్వర! నీలలోహితా! శరణు శరణు
సాంబ! నారాయణప్రియ! శరణు శరణ
టంచు కీర్తించు భక్తులనాదుకొనుము ॥ముక్తిదాయక॥

28 మదన సంహారుని మందార కుసుమాల
ఖట్వాంగపాణి చెంగల్వములను
కాలకూటాశను కనకాంబరంబుల
పార్వతీ పతినంది వర్ధనముల
గజచర్మధారిని కరవీరపుష్పాల
సకలదేవనుతుని జాజిపూల
హిమశైల జాధిపు విష్ణు కాంతంబుల
యురగహారాంకితు నుత్పలముల
చంద్రశేఖర నిన్నునే చంపకముల
పూజచేసెద కాపాడు భూతనాథ ॥ముక్తిదాయక॥

29 కాలకూటము మ్రింగి గళమునందుననిల్పి
కుక్షిలోపలి జగద్రక్ష జేసి

కలుష హారిణి గంగ తలపూవుగా దాల్చి
భక్తజనుల యార్తి బాపజేసి
భూతంబులై దింటి మూర్తియందున నిల్చి
జీవరాశులను బోషింపజేసి
ఓషధీ వర్గంబు నుద్భవింపగ జేసి
రోగభయంబుల రూపుమాపి
భూత గణముల రక్షణ బూనినావు
సృష్టి రక్షించి శిక్షించు నీశ్వరుండ ॥ముక్తిదాయక॥

30. ద్రుహిణసారథి ! నాదు దోషంబులెన్నకు
పాప చయము బాపు భసిత దేహ
శితికంఠ ! పూర్వసంచిత దుష్కృతము లెన్న
బోకు సత్కృతి గొమ్ము భోగి భూష
శంకరా ! సత్కార్య సంకల్పముల నిమ్ము
యపవాదు రానీకు డఘ వినాశ
భవరోగ వారణ ! భవపంక మెడలించు
నీ ప్రేమ గననిమ్ము నీలకంఠ
నాది నీదను భావంబు నాస్తిజేసి
చావు పుట్టువు లేనట్టి తావు నిమ్ము ॥ముక్తిదాయక॥

31. వేద సంచయములు విశదంబుగా బల్కు
నే మంత్రి మహిమచే నెసగుముక్తి
నారదాది మునులవారణ జపియింతు
రేమంత్ర మీభువి సృష్టి మొదలు
బ్రహ్మాది దేవతా వర్గంబు జపియింతు
రేమంత్ర రాజంబు నికం యనుచు

పదునాల్గు భువనాల ప్రజలకు నపవర్గ
భాగ్యంబు నేమంత్రి పఠన గూర్చు
నట్టి పంచాక్షరి జపియింతు నమలభక్తి
పూర్వభవ బంధముల బాపిముక్తి నిమ్ము॥ముక్తిదాయక

32 దక్షు యజ్ఞంబిల ధ్వంసంబుజేసితి
త్రిపురంబులను గూల్చితి శితికంఠ
దారుకా వన మధ్య తపసుల భార్యల
చెఱచి బాదించితి చిత్తజారి
చిరు తొండ నంబిచే సిరియాలు జంపించి
నరమాంసమును దింటి నాగభూష
కోడ్రిడ మాంసము దింటి కోయ దిన్నడువెట్ట
పుఱ్ఱె భోజన పాత్ర భుజగహార
నీదు లీలలు నెన్నంగ నేర రోరులు
మా యవజ్ఞత మన్నించి మమతబూను ।ముక్తిదాయక।

33 తారుణ్య కాంతల తను భోగసౌఖ్యముల్
రోయదు మనము విరూప నేత్ర
ఆలు బిడ్డల మీద ననురాగ పాశముల్
త్రెంచ నీదు మనసు త్రిపుర దహన
కొనలు సాగెడు నట్టి కోరికలను లతల్
కోయ నీదుమనసు కుధర ధన్వి
దాన ధర్మాది సత్కర్మ చయము చెంత
జేరనీదు మనసు చిత్తజారి
మనసు పొగరెల్ల నణగించి మరులు గల్గ
జేయు మయ్యా నీపాద రాజీవయుగళి ।ముక్తిదాయక।

34 ఆడంబరం బేది యంబరాంబరః నీకు
పచ్చియేనిక తోలు పచ్చడంబు
ముత్యాల హారముల్ ముక్కంటి నీకేవి
భుజగ సంతతి గదా భూషణములు
పాలు పెఱుగులేల భవదూర నినుగొల్వ
పరిశుద్ధ జలములే పావనములు
సుమతోయములుజాలు సుమనాధ నినుగొల్వ
తుదజాలు బూజింప దూర్వయుగము
నిశ్చలమదిని నీపూజ నెరపువాడు
నీదుకరుణకు పాత్రుడు నిగమవేద్య ॥ముక్తిదాయక॥

35 భర్గా! మహాదేవః పావనంబగుభూతి
మైనలదుకొనిన మాన్యజనుల
సతతము నీనామ సంకీర్తనము జేసి
రుద్రాక్షలను దాల్చు భద్రయశుల
పంచాక్షరీమంత్ర పఠన పారీణత
నీదురూపము గన్న నియతివరుల
రాగభోగముల విరాగులై చరియించి
సత్యభాషణజేయు నిత్యరతుల
పాదపద్మములకు వందనములు
వారు నీసరి వారలే మారదహన ॥ముక్తిదాయక॥

36 శార్దూల సింహాదిసత్త్వజాలంబుల
భయపెట్టు దావాగ్ని మంచుగాదె
మందరాది గిరీంద్ర మండలి పక్షముల్
ఖండించు వజ్రము కనులమగును

గంభీర జలరాశి కుంభినీ భాగంబు
గా దర్శనంబిచ్చు కాంక్షగలుగ
కాలకూట విషము కమ్మని పక్వాన్న
మగుగాదె మదిగోరి యడుగువేళ
శివశివా శివయంచు సుస్థిర మనమున
నిన్ను ధ్యానించువారికి నిశ్చయముగ ॥ముక్తిదాయక॥

37 సంసార మనునది శర్కరేమియుగాదు
కనుగొన్న నీమాయ కాలకంఠ
అర్థకామంబులు హరిశరా! నీమాయ
భవన సముదయంబు భర్గమాయ
కాంచి గర్వించు యీ కాయంబు నీమాయ
యాలు బిడ్డలుగన యభవమాయ
విఙ్ఞ పీగు నహము వృషవాహ నీమాయ
కీర్తిధనము మాయ కృత్తివాస
మాయజీవినెపుడు మూసి మాయజేయు
మాయదెలియుశక్తినిడుము మహితమూర్తి ।ముక్తిదాయక।

38 తవ నామకీర్తన ధరణిలో నొనరించు
భక్తవరుల పాద పద్మములకు
తవ భక్తకోటుల ధరనాదరించెడి
భక్తవరుల పాదపద్మములకు
తవ పుణ్యనిలయముల్ తనరంగ నిర్మించు
భక్తవరుల పాదపద్మములకు
తవ భవ్యచరితలు దగనచ్చు వేయించు
భక్తవరుల పాదపద్మములకు

సర్వదా మ్రొక్కెదను నేను చంద్రమౌళి
భక్తహృదయ మందిరవాస భానుతేజ
।ముక్తిదాయక।

39. వేధముఖోద్గత వేదముల్ నాలుగు
వ్యాకరణాది షడంగములను
విజ్ఞాన వార్తాది విద్యలు నాలుగు
మారణోచ్చాటనల్ మఱియు నాలు
సర్వశకున ధర్మ సాముద్రికాదులు
శాస్త్రంబులన్నియు జదువవచ్చు
ధాతుకృత్తులు పదతద్ధితాదుల సర్వ
లక్షణంబులనేర్చి రాణజెలగు
గానికై వల్య పదమును గాంచగలడె
నీదు నామస్మరణలేక నిగమవేద్య ।ముక్తిదాయక।

40. పావన మగునీకు పంచాక్షరీ మంత్ర
జపము సేయుగలుగు జనులయొక్క
భవదీయ పావన పాదోదకంబులు
నిత్యంబు నందెడి నియమివరుని
పరమపావనమగు భవదీయ దివ్యప్ర
సాదమబ్బిన పుణ్యజనులయొక్క
భవదీయ నిలయముల్ ప్రతిదినంబునుజొచ్చి
నిన్నుగాంచి తనియు నియమపరుల
భాగ్యమే భాగ్యమెన్నంగ పార్వతీశ
భక జన రక్ష సద్భక పాతహర ॥ ముకి దాయక ॥

41. నీనామ మేపొద్దు నిష్ఠతో జపియింప
గలుగుటే భాగ్యంబు కామదహన
నీభక్త తతిగూడి నిత్యంబు భాషించి
మహిమనందుటె జన్మమహిమయుక్త
పరమ మహేశ్వర ప్రభగాంచు యోగుల
శుశ్రూష ధన్యంబు సోమచూడ
భవదీయలీలలు పఠియించు జన్మమే
పావనంబియ్యల భసితదేహ
నీ మహాలింగ మీక్షింప నిఖిల కలుష
హరము నిగమసంచార మహాఘనాశ॥ముక్తిదాయక॥

42. చాతకవ్రాతము సంతోషమందుచు
తొలకరిజల్లుల కలరినట్లు
కోరిచకోరముల్ కూర్మిశరచ్చంద్ర
జ్యోత్స్నల హాయిగా జుర్రుభంగి
ఫుల్లాబ్జ గర్భహృత్ఫుల్ల భృంగసముద
యంబులు మకరంద మానుభంగి
నవ్యవసంతంపు దివ్యశోభలదేలి
గొంతయెత్తి పాడెడు కోయిలట్లు
చిన్మయానంద నీమూర్తి చింతజేసి
సంతతానంద పదమున సంచరింతు ॥ముక్తిదాయక॥

43. మధ్యాహ్న కాలంపు మార్తాండ తేజమై
పాపాంధకారంబు పాపజేయు
దేదీప్యకాయముల దేదీప కళికయై
ముక్తిమార్గముజూపు మురువుగాను

తాపత్రియాది సంతాప మేఘపటలి
పాఱంగదోలు ప్రభంజనమ్ము
గంభీర సంసార కంధి తరింప, స
హాయముగావచ్చు యానపాత్ర
మంత్రరాజములకు రాజు మహిమగల్గు
భవ్యపంచాక్షరి సహస్ర భానుతేజ ।ముక్తిదాయక।

44. మోక్షమున కిరవు, భోగభాగ్యంబులు
సమకూర్చుపెన్నిది, సాధురక్ష
సకలకార్యజయము; సంసార బంధంపు
ముక్తిగూర్చెడి దివ్యమూలశక్తి
బహుతృషాతురులకు ప్రప; యర్థిజనులకు
కళ్యాణములుగూర్చు కల్పతరువు
మృత్యుదంష్ట్రవినాశి: బృందారకుల రక్ష
యార్తిజనులకెల్ల నౌషధమ్ము
ఫాలలోచన నీదు కృపాధనమ్ము
కరుణచేకొమ్ము హిమకరఖండమకుట ।ముక్తిదాయక।

45. జయ భూతనాథాయ జయచంద్ర చూడాయ
జయనీలకంఠాయ జయము జయము
జయలోకరక్షాయ జయ కాల రుద్రాయ
జయమృత్యునాశాయ జయము జయము
జయనీలలోహితా జయలలా టేక్షణా
జయలోకనాయకా జయము జయము
జయవేద వేద్యాయ జయకృత్తినివాసాయ
జయనాగభూషాయ జయము జయము

జయము రవిశశివహ్ని లోచన జయమ్ము
జయము నీకిల త్ర్యంబక జయము జయము
॥ముక్తిదాయక॥

46. జ్ఞానాగ్ని దగ్ధమౌ కర్మంబు గలవారు
చిన్మూర్తి నీక్షించు సిద్ధవరులు
గురుపాద పూజనేమరక జేయువిశుద్ధు
లాత్మ శుద్ధిగలట్టి యమలమతులు
పరతత్త్వ మరయుచు పరమాత్మ చింతన
విధినిర్వహణజేయు వినయపరులు
మానవసేవయే మాధవుసేవంచు
ఫలితమాశించని భాగవతులు
జన్మరాహిత్యమునుబొంది; స్వర్ణపీఠి
నీదులోకంబు లోగందు రాదిదేవ ॥ముక్తిదాయక॥

47. వృద్ధాప్య సంకట భీతాదులుండని
చావుపుట్టుకలేక శాంతినొసగు
క్షుధ్బాధ తృషయును సుంతయైనను లేని
భ్రాంతులాశాదులు పొదుకొనని
శోకమోహాదులు చీకాకు పరుపని
యాతిబాధలకెల్ల యిరవుగాని
సచ్చిదానందమై సంతతము సుఖసం
తోషములాత్మ సంతుష్టినొసగు
నట్టి శివసాంబ సాయుజ్యమునరజేయు
చేరిగొల్చెద పాదరాజీవయుగళి ॥ముక్తిదాయక॥

48. నీపాద రాజీవ నిర్మల తోయముల్
నిత్యంబు నెవ్వాడు నియతిగొనునొ
నిన్ను ప్రదోషము నిష్ఠతో నెవ్వాడు
సర్వోపచార పూజలదనర్చు
బహుళపక్షమి నాటిపరమ చతుర్దశి
నీపూజ నెవ్వాడు నియతిజేయు
శివరాత్రి నిరశన స్థితి నిన్ను యేనరు
దర్చించు నిష్ఠమై వార్జవమున
యట్టినరునకు శివలోక మబ్బుటరుదె?
భక్తవత్సల కూటస్థ పార్వతీశ ।ముక్తిదాయక।

49. నీదుగేహిని జీవ నికరంబునకు మాత
నీవు తండ్రివి మాకు నిగమవేద్య
పరమపావని గంగ భవ! నీదు తలపూవు
కలుష హారిణి జీవ కారణంబు
భవదీయ రూపము పరికింప సులభమా?
వేదాంత మృగ్యంబు విశ్వకర్త
భవ్యపంచాక్షరి పారాయణంబిల
నపవర్గ సోపాన మఘవినాశ
చంద్రసూర్యాగ్ని నేత్రనిశాచరాంత
నయగుణాశ్రయ నిరుపమానందనిలయ ।ముక్తిదాయక।

50. హాటకరత్న సింహాసనాసీనవై
సామేని గైకొన్న చావగనగ
సకల బృందారకుల్ సామగానంబులు
నల్ప సాయంకాల సమయమందు

దుహిణుండు వేడ్కమైదుత తాళగతిజూప
వాణితోషంబున వీణమీట
సరసిజనాభుడు సానందమున మీరి
మద్దెలవాయిదృ విద్దెజూప
పాకశాసనాదులు నిన్ను బ్రస్తుతింప
తాండవంబాడు నటరాజదండనమయ్య ।ముక్తిదాయక

51. ధ్యానమ్ము జేకొమ్ము తక్షక కుండలా
యావాహనమ్మిదే యంబికేశ
యాసనమ్మిదెగొమ్ము యంబరాంబర: శక్తి
నర్ఘ్యమ్ము జేకొనుడఘ వినాశ
తోయమ్ముగై కొమ్ము ద్రుహిణి సారధి: ప్రేమ
పత్రమ్ము పుష్పమ్ము ఫాలనయన
దీపమ్ములివెగొమ్ము దివ్యమంగళ గాత్ర
ధూపమ్ము జేకొమ్ము పాపభూష
షోడశోపచారమ్ముల శుభపూజ
లమలమతి జేసెదనుగావ మార్తరక్ష ।ముక్తిదాయక।

52. చందనంబిదెగొమ్ము చంద్రార్థశేఖరా!
కస్తూరిగైకొమ్ము కాలకంఠ
పంచామృతంబిదే పంచధాత్రాత్మక
శుద్ధతోయములివే శూలపాణి
నీరాజనంబిదే నీలలోహితగొమ్ము
తాంబూలమందు మాతత్త్వరూప
ఘననివేదనగొమ్ము కాలకూటాశన
యాత్మ ప్రదక్షిణాంబభవగొమ్ము

చిత్తశుద్ధి పూజ లలరజేతు నెపుడు
మరలజన్మ కలుగ నీకు మారదహన ।ముక్తిదాయక।

53. శ్రీసాంబ శంకరా వృషభవాహన శివా!
యక్షేశ సన్మిత్రి రక్షరక్ష
భుజగకుండల ధరా! గజదానవాంతకా!
రజితాద్రి మందిరా రక్షరక్ష
మృత్యుంజయా! రుద్ర! మేరుపర్వతచాప
త్రైలోక్యసంరక్ష రక్షరక్ష
హాలాహలాశనా! హర! నీలకంధరా!
రతిమనోహర భంగ రక్షరక్ష
దక్షయజ్ఞ విధ్వంసక రక్షరక్ష
శిష్టజనపాలనన్ను రక్షింపుమయ్య ।ముక్తిదాయక।

54. భువనజాలంబుల బూడిద గాజేయు
హాలాహలంబిల నాహరించి
లోకకంటక, భయభీకర త్రిపురుల
కదన రంగంబున గర్వమణచి
మౌని సంత్రాసులై మచ్చరించి తిరుగు
వ్యాఘ్రాసురాదుల నణగద్రొక్కి
యవ్యాజ కరుణచే నపవర్గ సౌఖ్యంబు
తవభక్త కోటికి దనరజేసి
భక్తసులభుండ వై బ్రోచు పరమదేవ
నిన్నుమించిన దైవంబు నిక్కమెవరు ?
। ముక్తిదాయక ।

55. మాసంబులందున మాఘమాసంబును
దానంబులందన్న దానమహిమ
నారీమణులలోన నగజాతయెన్నంగ
వ్రతములందున సత్యపాలనంబు
మంత్రంబులందెన్న మహిత ప చాక్షరి
విద్యలందు వనాత్మ విద్యమహిమ
ధర్మంబులకునెల్ల తర్కింపగనహింస
పర్వతంబులనెన్న బసిడికొండ
యెల్లపూజల నీశానః యీశపూజ
గొప్పవని యార్యసంఘంబు కూర్మిబలుకు
॥ ముక్తిదాయక ॥

56. సర్వలోకాధార సర్వదైవత వంద్య
సచ్చిదానంద సంసారదూర
స్వప్రకాశ భసితః సర్వాంగశోభిత
విశ్వస్వరూపక విశ్వకర్త
నిర్మల విజ్ఞాన నిర్వికల్ప గిరీహ
ఋషి హృత్సరోరుహాభృంగః యభవ
శతకోటి రవితేజః సజ్జనకీర్తిత
భక్తపాలసకళా ప్రధితహృదయ
బహుళ వేదాంత వేద్యయో బ్రహ్మరూప
హరీశరాః నిగమాశ్వజోహారులివిగో ॥ముక్తిదాయక॥

57. ఆయురారోగ్యంబుల హరహంబీగల్గు
నేవేళ వంశంబు వృద్ధిజేయు

శారీర రుగ్మతల్ సాకల్యముగ బాపి
యంతరంగపు శుద్ధి నమరజేయు
దారిద్ర్యమెడబాపి ధనయోగ మొగిజేసి
కళ్యాణములు చాల కలుగజేయు
భోగభాగ్యంబులు భువిలోన జేకూర్చు
పరమున శివలోక పదవినొసగు
సాంబ! నీపూజ షట్కాల సమయములను
చేయువారి కిహపర సంక్షేమ మొదవు
॥ ముక్తిదాయక ।

58. నీభక్త తతిగూడి నీలీలనిత్యము
భాషించు భాగ్యము వడయువారు
శివయోగివర్యుల సేవలో నేవేళ
తనుధనాదులబెట్టి దనియువారు
జంగమ ప్రముఖుల సతతంబు గృహమందు
బూజించిదనిపెడు పుణ్యవరులు
సృష్టిలోని సకల జీవరాశులయందు
నీమూర్తి దర్శించు నియతివరులు
పరమ పూజ్యులు ప్రజలకు ఫణివిభూష
భక్త హృదయము భవదీయ భవనమిలను
। ముక్తిదాయక ।

59. ఓంకార మనుషగా యురగభూషణు మంత్రి
పఠనజేయునవియె వక్త్రమగును
నిష్ఠమై భస్మమ్ము నిండార బూసిన
తనువె తరింపగా తనువగును

పరమేశ్వరుని నిత్య పావనార్చజేయు
హస్తంబులేగదా హస్తయుగళి
శివలీల లేవేళ చిత్తశుద్ధిగవిను
వీనులే యెన్నంగ వీనులగును
సృష్టియందలి సకలమ్ము నీశునంశ
మంచుభావించుజన్మయే యమలజన్మ ॥ముక్తిదాయక॥

60. శివుని కారుణ్యము చిరతరాయువు శక్తి
ప్రబలకీర్తినొసగు భక్తులకును
శివుని కారుణ్యము స్థిరసంపదలనిచ్చి
సౌఖ్యంబు జేకూర్చు జనులకిలను
శివుని కారుణ్యము భవరోగ భయముల
పారద్రోలు నవని భక్తతతికి
శివుని కారుణ్యము చిత్తశాంతి నొసగి
తాపత్రయంబుల బాపజేయు
శివుని కారుణ్య మకరంద మవనియాను
వారిభాగ్యమే భాగ్యము భవవిదూర ॥ముక్తిదాయక॥

61. కాటుక కొండను కడలి మధ్యంబున
గలిపి సిరాజేసి కల్పవృక్ష
శాఖలు ఖండించి చక్కని కలములు
గాజేసి భూమియే కాగితముగ
సకల విద్యలరాణి జగములున్నంతకా
లము వ్రాయుచుండిన వ్రాయదరమె
మహనీయ కళ్యాణమహిత యశోధన
భవదనంత గుణసంపదలవియె?

మమ్ముబోంట్లకు వర్ణింపమాటలేవి
కరురు కాపాడుమయ్య సంకటము మాన్పి
॥ ముక్తిదాయక ।

62. శైశవక్రీడగా సైకతస్థలులందు
భవనముల్ నిర్మించి బాలురాడి
రంగవల్లులు దీర్చి అలిమించిబొమ్మల
పెండ్లిండ్లుగావించి విందుగుడిచి
యాటలన్నియునాడి యాపైన సర్వంబు
నాశనం బొనరింత్రు నవ్వుకొంచు
సృష్టిగావించి పోషించి యారీతిగా
నంతమొందించుటే యాటనీకు
సర్వజీవాళి రక్షించి సంహరించి
యుండిలేకుండు మాయావి దండమిదిగో
। ముక్తిదాయక ।

63. సాగరంబుల పొడచాఱియై జనుదెంచు
బాలు నంబరమందు పక్షివోలె
బంతులువలె నాడు పాషాణములు బట్టి
కనుదృష్టినేదైన కల్పగలుగు
నగ్నిగుండము జొచ్చు నబ్జాకరముబోలె
యా కట్టుకొనునెంత యధికుడైన
క్రూరసత్త్వంబుల గూడియాడగలడు
వాతాశనపు కోరచేత బెఱకు
నీకృపా ధనము వడయు నియమపరున
కెన్నగ నసాధ్యమన్నదేయిలను లేదు ।ముక్తిదాయక

64. బ్రహ్మంబు విష్ణువు బ్రహ్మాండ భాండను
నిగమ సంచయమెల్ల నీవెఱమ్మి
భూతంబులైదును పుణ్యకర్మచయము
జైవాత్మకార్యాలు నీవెఱమ్మి
ద్వాదశాదిత్యులు వర్ణప్రపంచము
నిందాదిదేవత లీవెఱమ్మి
నారదాది ఋషులు నక్షత్రమండలి
కాలచక్రము నీవెకాలకంఠ
ఆత్మవీవె మనోబుద్ధ్యహమ్ములీవె
యీశ సర్వమ్మునకు కర్తవీవెగాదె ॥ముక్తిదాయక॥

65. ఆకాశమేజూడ నీకేశ జాలంబు
లందు నిర్మలత దావమరతటిని
యుడు నాయకుడు శాంత మూర్ధ్వలోకంబులు
మూర్ధంబు గనుగొన భుజగహార
చంద్రసూర్యాగ్నులు శర్వనేత్రత్రయ
మోంకార మేధశ్క యుగ్రమూర్తి
హరిహర బ్రహ్మమై యలరు నదియెశూల
మదియె సత్త్వాది గుణాన్వితంబు
పరగు నీమాయ యేశక్తి పార్వతమ్మ
విశ్వరూపుడ నిన్నునే వినుతిజేతు ॥ముక్తిదాయక॥

66. రాజసంబున నీవు రమణీయ బ్రహ్మాండ
భాండంబు సృజియించి బ్రహ్మవైతి
సాత్వికంబున సృష్టిజల్లగా రక్షించి
పద్మనాభుడవైతి ఫణివిభూష

కామసంబున సమస్తంబు లయమొనర్చి
రోషభీషణత రుద్రుండవై తి
వసని గాడ్పును జలమగ్ని యాకాశంబు
చంద్రార్క తత్పురుషయుత యష్ట
మూర్తియున వెలుగొందు నీమూర్త్యనంత
కోటిరవితేజ: నీకిల సాటియెవడు? ।ముక్తిదాయక।

87. ఎవ్వాడు పృథ్వియై సృష్టియందలి
జీవకోటి బోషణజేయు గూర్పెసంగి
యెవ్వాడు వారియై యిమ్మౌన వాళిని
సంజీవనంబుగా సతముగాచు
నెవ్వాడు ప్రళయాన సృష్టిలయమొనర్చి
కాలాగ్నియగుచు దగ్ధంబుజేయు
నెవ్వాడు వాయువై యీసృష్టినాకాశ
రూపాన బూర్ణుడై వ్యాపియగునొ
అట్టి నిను ప్రార్థనము సేతు నష్టమూర్తి
కవటమై మమ్ము గాపాడు కరుణతోడ ॥ముక్తిదాయక

88. ఆదిమధ్యాంతము లమరి కృశత్వము
పరమాణముగలట్టి పామరుండ
నాదిమధ్యాంతము లసలులేని జగత్కు
టుంబి, విశ్వాత్మ నీవంబికేశ
షడ్వర్గరాగాది సర్వభావ సముదాయ
మందున గుర్తింపడునల్పతముడ
గుణ రహితుండవగణిత తేజోమయ
మూర్తి నీవు ప్రధాన పూరుషుండ

వట్టి నీదు గుణంబుల నాదిదేవ
మహినివర్ణింప నీలవియె మాదృశులకు
। ముక్తిదాయక ।

69. శర్వుండవై నీవు జలమూర్తి వగుదవు
భవనామధారివై వసుధవగుదు
వుగ్రనామంబున హుతభుక్కు వగుదు, మ
హాదేవ నామాన నబ్జుడగుదు
భీమనామంబున వ్యోమరూపుడవౌదు
రుద్రనామమున మారుతుడవౌదు
పశుపతి నామాన వరయజ్ఞపురుషుండ
వీశానుడనుపేర నినుడవౌదు
పంచభూతము లినశశి పావకులుగ
వెల్గునష్టమూర్తివి నీవు విశ్వకర్త ॥ముక్తిదాయక॥

70. ఓమ్మను నక్షరంబున నాధుడీవౌదు
నిర్గుణ బ్రహ్మంబు నిగమమందు
అఉమకారంబుల నర్ధమాత్రయు గూడి
త్రిగుణరూపంబుగా తేజరిల్లు
వేదత్రయంబును విశ్వకర్తలు జాగ్ర
దాద్యవస్థలు మూడునవిముగాక
ప్రాజ్ఞతైజస విశ్వపరమ రూపములుశ
రీరత్రయంబగు వృషభవాహ
వర్ణములకెల్ల నాద్యమై వరలుచుండు
వట్టియోంకార రూపుడ యంజలిదిగొ ।ముక్తిదాయక।

71. సూర్యుండు నీవని సోముండు నీవని
పావకుండవు నీవు పాకశాస
నాదిదేవతలును హంస వాహన సర
సిజనాభ రుద్రులు సిద్ధగణము
గంధర్వాదులు నీవెకాలుండు పంచభూ
తంబులై దను నీవె తథ్యమనుచు
వేదాదులిలనిన్ను విశద పరుచుగాని
శోధించి జూచిన సాధకునకు
నీవుగానిది సృష్టిలో నిక్కమేది
లేదులే దుర్వి జూడంగ లింగరూప ॥ముక్తిదాయక॥

72. అష్టాంగ యోగంబు నభ్యాస మొనరించు
మునులు హృత్సీమఁగాంచు మూర్తియగుచు
విమలమై స్వచ్ఛమౌ విజ్ఞాన మవరమి
తానందదాయియై యలరియుండి
వేదవేదాంగాది వివిధ శాస్త్ర చయము
ప్రతిపాదనము సేయు పరమమూర్తి
పరగి శరీరమున ప్రత్యగాత్మయనంగ
దనరి యోగ మహిమ దర్శనమగు
నట్టి నిర్మలానంద మయంబు చిద్వి
లాసయుతము భవమూర్తి రక్తిగాంచ ।ముక్తిదాయక

73. సర్వజ్ఞుడవు నీవు జగదేకమూర్తివి
స్వప్రకాశుండవు సదముండవు
నిగమ సంచయముల నిశ్వాస పవనంబు
నీమూర్తి సగుణంబు నిర్గుణంబు

సర్వశబ్దగతుల నమృతోపమానమై
నీవాక్కు మధురంబు నిర్మలుండ
బ్రహ్మాది దేవతా వర్గంబుయత్నించి
నీమూర్తినెన్నంగ నియతిగలదె
నాదు వాక్యచయము పావనంబు సేయ
నీదువర్ణనగావింతు నియమ ఫణితి ॥ముక్తిదాయక॥

74. క్రైస్తవ సంఘంబు రహిమీర బూజించి
కీర్తింప బరగుదు క్రీస్తనంగ
ముస్లిము సోదరుల్ ముక్తిగోరి భజింప
నల్లాగ వారల కమరినావు
బౌద్ధ జైనులలను భావింప నీమూర్తి
నిర్గుణ రూపంబు నిర్వికల్ప
హిందువుల్ భక్తితో హేరాళముగ గొల్వ
రామాది నామముల్ రాణదెలగి
తెవ్వరేపేర బిల్చిన యెవరిమతము
వారనుసరింప నీమూర్తి బరగునొకటి ।ముక్తిదాయక।

75. విద్యుల్లతావర్ణ విస్ఫూర్తి తత్పురు
షుండు తూర్పున పరశువు ధరించి
దక్షిణమున పుఱ్ఱెదండలు (ఢమరుక)
దాల్చి యఘోరుండు దక్షవైరి
తుహినాంశుధారి సద్యోజాతు డఘువినా
శి, సదాశివుండు పశ్చిమమునందు
వామదేవుండు సుత్రామ వందిముడుదీ
చిని నాల్గుముఖములు దనరదాల్చి

యుగ్రమూర్తివై యీశాన యూర్ధ్వమునను
పంచవక్త్రుడవై బోవు ఫణివిభూష ॥ముక్తిదాయక॥

78. శ్రీమంత్రము సకల శివదాయకము పాప
తుధరసంఘంబుల గూల్చువివియు
బ్రహ్మాది దేవతా వీరభజ నార్థమై
తత్త్వార్థబోధకదాయి యగును
కాశీనృపాలు నేకైక తనూజ నీ
మంత్రమహిమ భర్తమహిమ పరచె
దాశార్హ భూపతి తవనామజపముచే
పాపదశాకంబుల బాసగలిగె
కృత్తివాస నీపంచాక్షరి జపియింప
దుర్భర భవరోగభయము దొలగిపోవు
। ముక్తిదాయక ।

77. కల్మాషపాదుండు ఖండేందు ధరుపూజ
బ్రాహ్మణ వధఘోర పాపమెడపె
గోకర్ణ తీర్థవు శ్రీకంఠు పాద బి
ల్వదళము జండాలి గ్రాలె ముక్తి
శునకంబు శివరాత్రి శుభదీప మాలికల్
దర్శించి మనుజన్మ ధరణినిలె
పలుజన్మ సంగతుల్ వదిలంబుగాగల్గి
దాశరాజు ధరణి ధన్యుడయ్యె
నీదు పూజలు సత్యము నిష్టనెరపి
ధూపదీపము లర్పింపదురితహరము ।ముక్తి దాయక

78. నిన్నూహ లోనించి నియతిమై గోపాల
బాలుండు ధ్యానింప భక్తసులభ
యశ్మలింగముగాక యచ్చపుగుడి నిల్పి
ప్రత్యక్షమై యటపొదుకొంటి
చంద్రసేన నృపాలు సదమల శివపూజ
శత్రువర్గంబెల్ల మిత్రులైరి
యుభయ త్రయోదశీ యుత్కృష్ట వేళల
భోగి భూషణు పూజ ముక్తినొసగు
చిత్తమే పొద్దు నీపూజ వత్తమిల్ల
చిన్మయానంద నీమూర్తి చింతజేతు ॥ముక్తిదాయక।

79. భిక్షమెత్తుకొనిన విప్రరాజ కుమారు
లిద్ద్వరు నీపూజ లిలనుజేయ
భూసురబాలకు భూరివిత్తమునిచ్చి
రాజకుమారకు రాజ్యమిచ్చి
వారిచెంచిన విప్రవనితకు సంతోష
మొనగూర్చి కష్టము లుడిపినావు
ధర్మగుప్తుని దల్లిదండ్రుల రక్షించి
నీపూజ మహిమల నిల్పినావు
శర్వ నీపూజ నిత్యము సలుపువారు
సుఖములందు టబ్బురమౌనశూలపాణి ।ముక్తిదాయక

80. సోమవారము చిత్తశుద్ధిగ నీపూజ
సల్పునరుడు బొందు సంపదాళి
తొల్లిసీమంతి నీ తోయజాక్షిపతిని
పాతాళ మెడలించి భార్యగూర్చె

తాయమ విమల భక్త్యావేశమును బరీ
క్షింప విప్రతనయు స్త్రీగబంప
నామె భావనజేసెనాతని వనితగా
నంతనచ్చంపు నాతిగా నతడు మాఱె
సోమవారము హిమశైల సుతను నిన్ను
భక్తి పొలుపొఱ పూజింపముక్తిగలుగు॥ముక్తిదాయక॥

81. శివకవచముపదేశించి భద్రాయువు
రక్షించె ఋషభుండు రమ్యగతిని
పరమ పావనమైన భస్మంబు మైనంట
నసుర భావముపోయి యమడయ్యె
రుద్రాక్షధారణ భద్రమై శునక కీ
శంబుల కుత్తమ జన్మగలిగె
చితి భస్మమొక్కటే శితికంఠునుపహార
మొనరించి శబరులు గనిరి ముక్తి
నీదు రుద్రాక్ష భస్మముల్ నియతిబూన
సకల కార్యసంసిద్ధియై జయముగల్గు ।ముక్తిదాయక।

82. రాజునకు కుచంబు రాజశేఖరనీదు
మూర్తియై భాసిల్లి ముక్తినొసగె
మేకపెంటిక నీయమేయ రూపముగొల్ల
వానికి శివలోక పదవినొసగె
నీదు భక్తులవద్ద నిక్షేపముగ నున్న
వంగకాయలు మాఱెలింగ తతిగ
నవహేళనముసేయ నావాహి తమ్మైన
కుచంబు లింగమై కుదురుకొనియె

భావమందు నీదివ్య రూపమ్ము భక్తు
లెటుల భావించి దలతురో యటులెయగును
॥ ముక్తిదాయక ॥

83. సకలచరా చర నికరంబులోనిండు
నీకాది యంతంబు నిక్కమేది
బ్రహ్మవిష్ణులు నీదు పరమ లింగాకార
మరయనేరక తమ యోహముపీడ
కరుణించి వారల కనుల విందొనరించి
సగుణ రూపమున సాక్షాత్కరించి
భవదీయ మహిమలు పారవశ్యంబున
బొగడంగ గంటివి భువనవంద్య
అహము వర్జించి యవడు నిన్నహరహమ్ము
పూజలొనరించు వానికి ముక్తిగలుగు ।ముక్తిదాయక

84. సౌందర్య మెరజూపి శైల నందననిన్ను
చేపట్టగాలేక సిగ్గుజెంది
దృఢదీక్ష తపముచే దృప్తిపరుప కీలు
వట్టియు తనువున భాగమిడితి
స్త్రీవిలాసంబుల సిద్ధింప నట్టిది
తపముచే మెప్పించి ధన్యయయ్యె
హృదయ నైర్మల్య మహిత గుణ యుతముగా
నిన్ను బొందగలరు నిగమ వంద్య
వేషభాషల నినుబొంద వీలుగాదు
భూత దయగల్గ సత్కృప బొందు నరుడు
॥ ముక్తిదాయక ॥

85. యాదవ నరపాలు నాజ్ఞముండితశిరో
జయగుదాసిగనెకేశములుభక్తి
యమార్ణనాథునినీదు యుత్తమలోకాన
పదవినిచ్చితి వాని భక్తిగరిమ
సర్పదంతుల కిల సాయుజ్యమొదవంగ
జేసితి భక్తికి చిత్తమలర
మూఢ భక్తికి ముఖ్యాంగ మర్పించు
తిన్నని కిచ్చితి దివ్యపదవి
భక్తిగతి లింగపతియను పల్కునిజము
భక్తిహృదయమ్ము గుడినీకు భక్తిసులభ
॥ ముక్తిదాయక ॥

86. వరుస తొమ్మిది తలల్ కరఖడ్గమునగోసి
నీపాదసుమ పూజ నిష్ఠనెరప
లంకేశు భక్తికి రంజిల్లి హృదయంబ
భీష్టకోర్కులనిచ్చి వీడుగొల్ప
దుర్వార భుజబల గర్వితి రేకియై
రజితాద్రి పెకలింప భుజగహార
యంగుష్ఠమున ద్రొక్కి యహమడంచియువాని
బంపి తధోలోక వాసమునకు
నహముపీడి నిన్నావల యర్థివేడ
కరుణగాచితి రావణు గరళకంఠ ।ముక్తిదాయక।

87. నీకృపా ధనమున్న నియతివరుని భాగ్య
మిందు భాగ్యము కన నెన్న ఘనము

బలిసూతి బాణుండు పాకశాసనుగొట్టి
దేవతా గరిమంబు ధిక్కరించి
ప్రార్ధింప నినుభక్తి పట్టణంబునుగాచి
హరితోడ యుద్ధంబు గరపినాడ
పెవ్వాడు నినుభక్తి నేవేళ నర్చించు
వానిదేభాగ్యమ్ము వామదేవ
తవచరణ పద్మముల భక్తి తనువువంచి
పూజలొనరించు వానిదే పుణ్యతనువు ॥ముక్తిదాయక॥

౪౪. సరసిజనాంభుడు పరమేశ నినుగూర్చి
పద్మముల్ వేయింటి బరగదెచ్చి
యతిభక్తి నీపూజ నమరజేయు, పరీక్ష
జేయంగ నొకపూవు మాయజేయ
విష్ణువర్పణజేసెవెన్వెంట నేత్రంబు
సంప్రీతి నేత్రంబు సరిగజేసి
భువనపాలన మహాభోగంబు నిచ్చి, సు
దర్శన చక్రయుధంబునిడితి
భక్తపాలన చాతుర్య ప్రాభవుండ
శత సహస్రవందనములు చంద్రమకుట
॥ ముక్తిదాయక ॥

౪౫. వైదిక కర్మముల్ భవదీయ కృపలేక
ఫలమునీజాలునా ఫాలనయన
యజ్ఞ ఫలంబున కధికారివైనీవు
సృష్టియంతటనుందు వృషభవాహ

నిన్ను పూజింపని నీచంపు యజ్ఞముల్
దక్షుయజ్ఞము రీతి ధ్వంసమగును
నీపూజసేయుచు నియతి కర్మలుజేయ
పూర్ణఫలము ప్రాప్తిబొందునయ్య
నిన్ను నమ్మిచెడినవారు నిఖిలమందు
లేరు భక్తహృదయవాస లింగరూప ।ముక్తిదాయక।

౭౦. సత్కవి వర్యుండు నత్కీరుడనువాడు
నీపద్యమందన నెఱసులెన్న
శాపమిచ్చితిగదా సర్వాంగముల కుష్ఠు
వ్యాధిసోకి మిగుల బాధపడగ
వానితప్పుదెలసి మానిత భక్తి స
త్తీర్థ యాత్రలుజేసి దేహియనుచు
దక్షిణకైలాస మక్షీణ మహిమమ్ము
శ్రీకాళహస్తిని జేరిగనగ
కుష్ఠు వ్యాధినయముజేసి కోర్కెదీర్చి
పరమశివలోక సాయుజ్య పదవి నిడితి ముక్తిదాయక

౭౧. స్వార్థమేగాని పరార్థముగిట్టదు
నేటినేతల మాటనీటిమూట
కల్లిమాటలు జెప్పి కార్యంబు నెఱపుచు
బక్కవారినెపుడు లెక్కగొనరు
పదవులందుండిన పదిలంబు గానెంచి
పరువుపోయిన గాని బాధపడరు
ప్రజల బాగె తమకు పరమావధియటంచు

రచ్చమైన ప్రజాసేవ యసలులేదు
పరువుపోయిసంత విలువ పదవికెంత? ॥ముక్తిదాయక॥

92. ధర్మదేవతకాళ్లు దుర్మార్గముగ ద్రుంచి
కదలంగ నీయక నడుపుజేసి
అర్థమ్మునకు స్వార్థ మర్థమ్ముగా జెప్పి
పెఱవారియర్థము పిండుకొనుచు
కామమే జన్మకు ఘన పురుషార్థమ
టంచు సంఘాన వర్తించుచుంచి
మోక్షము మాటల ముఖ్యమై యలరారు
నార్జవంబిలను విసర్జజేసి
జనులు పురుషార్థ సమితికి మనువుదీర్చ
యిష్టవర్తనులైరి మహేశగావు ॥ ముక్తిదాయక ॥

93. సజ్జనకోటి దూషణజేయు తులువలు
లేని నిందలు మోపఖూనునరుల
నొరుల నొత్తగుభామ నరయక కాక్షించు
వారిని పై శున్యవ్యసన పరుల
నిర్మలోదకమందు నిష్టీవన పురీష
ముల విసర్జించెడి మూఢమతుల
తల్లిదండ్రి గురువుడనకన్న జ్ఞానుల
దోషచయము నెన్ను ధూర్తగుణుల
క్రూరరౌరవాది నరక ఘోరశిక్ష
బొంద, కీటకాదుల జన్మనందజేయు ।ముక్తిదాయక।

84. అక్షయజ్ఞాన మహానిధులనుజూపు
నద్భుతమైన నయనాంజనమ్ము
పరదేశములకేగ బ్రజలచే మన్నన
అందజేయు పరమ బంధుజనుడు
దాయాదులెవ్వరు తమభాగ మిమ్మని
గోరనేరని మహాకూర్మిధనము
దేవనరాదుల ధీవిభవ గరిమ
నాకట్టు కొనగల్గు నౌషధమ్ము
మించుకాంతులు సమకూర్చు మేనికిలను
విద్యవంటిధనము లేదు వెదకిజూడ ॥ముక్తిదాయక॥

85. దానధర్మాదులు తనశక్తి మేరకు
పాత్రమెఱిగిజేయ భాగ్యమబ్బు
వృద్ధుల సేవింప వినయంబు జ్ఞానము
బుద్ధికుశలతయు బొందవచ్చు
ధరనహింసావ్రత ధర్మాచరణ జేయ
దీర్ఘాయురారోగ్య దీప్తి గలుగు
దైవబలమునమ్మి జీవయాత్రనడప
సంసార యాతన సగము తగ్గు
మాటతప్పని మనుగడ మనుజులందు
విలువపెంచును నరునకు వృషభవాహ ।ముక్తిదాయక

86. బలవంతుడైనను ప్రాప్తమింతయు లేక
ధనము గలుగుబోదు ధరణిలోన
ప్రాప్తమించుకయున్న పాత్రుల వెదకుచు

శతసహస్ర శరాళి హతుడైన మృత్యువు
గలుగునెట్లు మరణ ఘడియరాక
మరణ సమయమైన మారణాయుధమేల
గాలి దూలి ఖువిని గూలుప్రాణి
చావుపుట్టుక లియ్యిల జీవివశమ
పాపపుణ్య కర్మఫలము ఫాలనేత్ర ॥ముక్తిదాయక॥

97. మరణకాలముదాక మదవతీ మోహంబు
మమకారములు ప్రాణి మరువలేడు
పశుపుత్ర బంధువుల్ స్వజనమంచు దలచు
నర్ధమ్ము తనదిగా నవనిదలచు
కనుల జూచినదెల్ల కలకాల మెుండునం
చెలమి స్వార్థమ్మును తలగలేడు
కండకావరమున కన్నుగానకిలను
మేధోస్థి దేహంబ మేయమనుచు
నిన్ను మరచి తిరుగుప్రాణి నీదునామ
భజనసేయుడు మన్నించు భానుతేజ ॥ముక్తిదాయక॥

98. గాలికి కులమేది గంగకు కులమేది
యగ్నికి కులమేది యఘవినాశ
ధరణికి కులమేది తను రక్తమాంసమ్ము
లేకులము గలవి వృషభవాహ
పాలకు కులమేది పాటలముల కుల
మేది భానుని కులమేది యభవ
ప్రకృతికి కులమేది పాదపాదుల కుల
మేది సుమరాశికెద్ది కులము

కుసుమ కోదండ హర! నీకు కులముగలదె
గుణము గొప్పదిగావలె కులముతేల ।ముక్తిదాయక।

99. కులతత్త్వవాదులు కుటిల బుద్ధులనూని
మానవత్వము నేడు మంటగలుప
మతతత్త్వవాదులు మతపిశాచమురేపి
స్వార్థపూరిత మతివర్తిలంగ
ప్రాంతీయ తత్త్వము ప్రజలకుద్బోధించు
నధికార దాహంబు లధికమగుచు
స్వార్ధంబు మితిమీఱి పరజీవహరణంబు
లెక్కగావకజేయునిక్కువముగ
కులమతములు స్వార్థపరుల కుట్రఖమ్మి
మానవత్వమే గణియింప మహిని కులము
॥ ముక్తిదాయక ॥

100. నీదులింగము గన నీలలోహితరాయి
శంకరా నీసతి శైలతనయ
నీహార శైలుండు నీమామ బాంధవ
వర్గంబు పరికింప ఖర్గ శిలలు
భవదీయ చాపము పశుపతీ శిలగదా!
కైలాస మిలజూడ శైలమభవ
కంకాళములు మాల గళసీమ నూనెదు
హస్తమందున పుఱ్ఱెయులరునీకు
భక్తజనులకు కారుణ్యవత్సలుడవు
భక్త మానస వాస! కాపాడుమము ।ముక్తిదాయక।

101. నీ విహారస్థలి నిక్కంబు మరుభూమి
భిక్షమెత్తుకొనుట వృత్తినీకు
గజచర్మమే మేన కమనీయ వస్త్రము
శవభూతిమై పూత సాంబమూర్తి
భస్మాసురాదులు భవదీయ భక్తులు
సైన్యవర్గంబు పిశాచగణము
గరళమ్ము నిల్పితి కంఠమందున సదా
ఫాలనేత్రమునందు వహ్ని నిడితి
విన్నియున్నను శివుడవు సన్నుతుడవు
భక్తజనకల్ప వృక్షమా! పరమపురుష।ముక్తిదాయక

102. చిన్ననాడొనరించు చిలిపిపనులనెల్ల
మన్నించి రక్షించు మారదహన
పాఠశాలకు బోవు ప్రాయ మందేమియు
తెలియంగనై తిని త్రిపురదహన
యౌవన మందలి యాగడంబులనెల్ల
క్షమియించి బ్రోవు నన్నమితకరుణ
తరువాత కాలాన దరిలేని సంసార
సాగరాన బడితి నాగభూష
యొడ్డునకుజేర్చి బడలిక యుడుగజేయు
నీదు నామసంకీర్తన నియతిజేతు ॥ముక్తిదాయక॥

103. దానధర్మంబులు తగువారికిలజేసి
ప్రఖ్యాతి మిగులంగ బడయవచ్చు
సత్పుత్రుడుదయింప సరివారి సరసన
ఘనుడంచు మెప్పుల దనరవచ్చు

నిర్భాగ్య కన్యకా నికరంబునకు పెండ్లి
చేయించి ప్రఖ్యాతి జెందవచ్చు
వాపీతటాకాదివారి దానంబుచే
నమలమైన యశమునందవచ్చు
గాని మఱుజన్మ మొదవని కాంక్షదీర
నీదు భజనసేయవలయు నీలకంఠ ॥ముక్తిదాయక॥

104. పండ్లూడి నీనామ పఠనజేయగలేని
దుస్థితి దేహాన దోపకుండ
వృద్ధాప్య మొదవంగ వీనులు చెడిపోయి
వినలేని దుస్థితి చెనకకుండ
రోగముల్ దేహమారోహణ మొనరించి
తనువు జర్జరితమై తలగకుండ
సతిసుతానీకము సైరణ గోల్పోయి
కడు నసహ్యంబున గాంచకుండ
పరమపావన నీనామ భజనచేసి
నన్ను దరియంగ నిమ్మునీ సన్నిధికిని ।ముక్తిదాయక

105. కలిగినంత వరకు కాదనకితరుల
సంతృప్తినొందించు సాధుజనులు
పరధనంబులు తృణప్రాయంబుగా జూచు
ధర్మజీవన మహాధార్మికులును
నిష్కామ కర్ములై నిండుమనంబున
సంఘసేవలజేయు సదయ పరులు
సర్వభూతహితము సర్వదా కాంక్షించి
తగురీతి వరించు తగవరులను

నీదు మూర్తులె నిక్కము నీలకంఠ
వారి పాదపద్మములకు వందనములు ॥ముక్తిదాయక

106. సృష్టిలోని సకల జీవరాశులయందు
మానవ జన్మము మహితయుతము
చైతన్యవంతుడై సద్వివేకమొదవి
ముక్తినందు కొఱకు శక్తిమేర
వివిధమతంబుల వివిధనామంబుల
ఋజు వక్రగతుల చరించు నరుడు
మతములు గమ్యంబు సతతంబు నీవౌదు
వెల్లనామచయము లీశనీవె
సృష్టియంతట నిండిన జీవశక్తి
నీవని యెఱుంగువాడెపో పావనుండు ॥ముక్తిదాయక

107. నవరత్న మణిమయ నవ్యభండారముల్
గలకుబేరుండు సంగాతకాడు
వారాశి కన్యకు గారాబు పెన్మిటి
పద్మనాభుడు నీదు భక్తవరుడు
సర్వౌషధీవర్గ సముదయంబులవాడు
మంచుకొండలరాజు మామనీకు
కామితార్థములిచ్చు కామధేనువు కల్ప
తరుసాటి హేమాద్రి తవధనస్సు
తిరిపెమెత్తుట నీలీల పరమ పురుష
నాయురారోగ్యముల నిడు మవిరళముగ
॥ ముక్తిదాయక ॥

108. కోమర్తి గ్రామము గ్రామ సీమలకెల్ల
తలమానికంబుగ యిలనువెలసె
నన్నిరంగంబులందాధిక్యమును గల్గి
పలువుర మన్నన బడసెమున్ను
భవ్యధరామర వంశంబు నంబుట్టి
రమణయ్యనామాన రహిజెలంగి
యధ్యాపకవిధిని యత్యంత శ్రద్ధతో
నిర్వహించుచు దేవ నిన్నువొగడ
శతకమొక్కటి సీసంపు సరులగూర్చి
యర్పణము జేయుచున్నాడ నభవగొమ్ము
॥ ముక్తిదాయక ॥

109. హరితసగోత్రుడు నరసింగరాయుడు
మాధ్వుండు ధీశాలి మహితయశుడు
గ్రామాధికారియై ఖ్యాతిగాంచిన యట్టి
సత్వగుణుడు వాదుజనకవరుడు
కోమర్తి గ్రామవు సీమంతినీ భూష
తలనాల్క రమణమ్మ తల్లి నాకు
తల్లిదండ్రుల చిన్నతనమందె గోల్పోయి
యెన్నియో యిడుమల నిలను బడితి
సభవ! నీ కృపామృత వృష్టి విభవమునను
నేటి కిట్లుంటి ననుసాకు నిర్గుణుండ ।ముక్తిదాయక।

110. అగ్రజన్ములు మహిమాన్వితుల్ ధీమతుల్
రాందాసు కిషన్ లలిత హృదయ

లంధగ్రిసంజాతుడసమాన తేజుడు
రాందాసు జనసేవ రాజిలంగ
నొవరించి బొంబాయి జనపథ వాసుడై
కార్మిక జనసేవ కూర్మిచేసె
గ్రామాధికారిగా ఖ్యాతినందియకాల
మరణాన కిష్టప్ప పరముగనియె
మా కుటుంబ సభ్యులనెల్ల మహినిచల్ల
గా సతతము కాపాడు కైలాస వాస ॥ముక్తిదాయక

111. చొప్పల్లి వంశపు సుజ్ఞాన భాస్కరు
స్వామి జగన్నాథు పాదయుగళి
స్మరియించి చేసెద సాష్టాంగ వందన
ములు వ్యక్తిగా నన్ను మలచినారు
గంటి వంశవిబుధు కృతుభుగ్గురు సమాన
వరసింహశాస్త్రికి నతులుసేతు
తెలుగు భాషా యోష తీరుతెన్నులు జెప్పి
యభిలాష గల్గించె నభ్యసింప
నాది గురుమూర్తులియ్యద్దఱవని నాకు
వారివంశంబు రక్షించు వర్థిలంగ ॥ముక్తిదాయక॥

112. కర్రి సుబ్బారావు కవివరేణ్యులు నాకు
పద్యమల్లు గలుగు విద్యనేర్ప
బంకుపల్లాన్వయ వారాశి చంద్రుడు
సూర్యనారాయణ సూరికొంత
రాఘవపాండవ రమ్యకథా ద్వర్థి
కావ్యసరళిజెప్పి భవ్యుజేసె

సమరంబు రఘువంశ మమరంగ నేర్పించె
లక్ష్మణశాస్త్రి సల్లక్షణుండు
వారినే వేళనారోగ్యవర్ధనముగ
నరసిగాపాడు మియ్యల నష్టమూర్తి ॥ముక్తిదాయక॥

॥ సమాప్తము ॥



# శ్రీ ముఖలింగేశ్వర శతకము

## లఘుటీక - సంబంధ పురాణకథలు

1. రజితగిరి నివాస: కైలాస పర్వతమున నివశించువాడ. సోమసూర్యాగ్ని సుశోభితనేత్ర: చంద్రుడు, సూర్యుడు, అగ్ని మూడు నేత్రములు గలిగి మిక్కిలి శోభించువాడ. నిగమగోచర: వేదములచే తెలియబడువాడ. మందరాచలధీర: మందర పర్వతముతో సమానమైన ధీరత్వము గలవాడ.

హేమాద్రి ధ్వని: మేరు పర్వతము ధనస్సుగాగలవాడ మకుటము యొక్క అర్థము: ముక్తిదాయక: మొక్షమునిచ్చువాడ; సర్వేశ: ఈ సృష్టి సర్వమునకు ప్రభువైనవాడ భక్తవరద: భక్తులకు వరములిచ్చువాడ; అంగభవ: మన్మధుని; భంగ: భంగపరిచినవాడ శ్రీముఖలింగమునందు వెలసియున్న ఈశ్వరా.

2. విఘ్నచయము: ఆటంకముల సమూహాము; పలుకు పలుకులందు: నేను చెప్పుచున్న మాటలందు; పద సంచయములు మాటల సమూహాములు; మొదలిపేల్పుసతి: బ్రహ్మ భార్య సరస్వతి; పూనిక: పూనుకొనిన కార్యము; కార్తికేయుడు కుమారస్వామి (మహాపండితుడు, కవి)

3. ఆశ్రితరక్ష: ఆశ్రయించిన భక్తులను రక్షించువాడ; కాశీయందు-విశ్వేరుడు-విశాలాక్షి; శ్రీశైలమున-మల్లిఖార్జునుడు భ్రమరాంబ; కాళహస్తిని-శ్రీకాళహస్తీశ్వరుడు-జ్ఞానప్రసూనాంబ శ్రీ: సాలిపురుగు; కాళము: పాము; హస్తి: ఏనుగు వీటిని మోక్షమిచ్చినవాడు గాన శ్రీకాళహస్తీశ్వరుడు; శ్రీముఖలింగమున-శ్రీముఖలింగేశ్వరుడు-వారాహి అమ్మవారు; పాప సంఘంబు: పాపముల సమూహాము; ఫాలనయన: నుదటియందు కన్ను గలవాడా!

4. సుందర తరుగుల్మశోభిత: అందమైన చెట్లతోను వాటిని చుట్టియున్న లతలతోను మిక్కిలి శోభను గలిగియున్న దివ్యక్షేత్రములు: మంచిసారవంతమైన భూములు; పెంపెస లాఱు: అందముతో ప్రకాశించు.

భావము: అందమైన చెట్లతోను లతలతోను విలసిల్లుచున్న వంశధారా తీరమున ప్రకాశించుచున్నది; కంద మొదలగు కూరలు, మినుగులు పెసలు మొదలగు కాయ ధాన్యములు; అనేక రకములైన ధాన్యసంపదలు పండెడి సారవంతమైన భూములతోను; కనుల పండువుసేయు శిల్ప కళలుగల దేవాలయములతోను; మంచి సంపదలనిచ్చు అడవులతో గూడిన కొండలతో చుట్టుబడినది అగు శ్రీముఖలింగ క్షేత్రమున భక్తులను కాపాడుటకై నీవు వేంచేసియున్నావు.

5. పంకజాసను పూజిత భవ్యచరిత: బ్రహ్మచే పూజింపబడిన గొప్ప చరిత్ర గలవాడ!

భావము: ఓపరమేశ్వర! కృతయుగమున గోకర్ణేశ్వరుడను పేర బంగారు లింగమై నీవు వెలసినావు. త్రేతాయుగమున మధుకేశ్వరుడను పేర వెండిలింగమై వెలసినావు. ద్వాపరయుగమున జయంతీశ్వరుడను పేర కంచులింగమై నీవు వెలసినావు. కలియుగంబున లింగమందు ముఖమును దాల్చి యిప్పచెట్టుమొదల శిలారూపమున భక్తులను రక్షించుటకై శ్రీముఖలింగమున వెలసినావు.

6. వామదేవుని యజ్ఞము:- పూర్వకథ

ద్వాపరయుగమున వామదేవుడను ఋషి వంశధారా తీరమందు (యిప్పటి శ్రీముఖలింగ ప్రదేశము) ఒక గొప్ప యాగము చేయ తలపెట్టెను. ఆ యజ్ఞమునకు దేవతలను కిన్నర కింపురుష గరుడ గంధర్వాది దేవగణములను ఆహ్వానించెను. వారందఱును వచ్చిరి.

ఆ దినములలో యిప్పటి శ్రీముఖలింగక్షేత్రముగల వంశధారా నదీ తీరము దట్టమైన అరణ్యముగనుండెడిది. అందులో మధూకవృక్షములు (యిప్పచెట్లు) యెక్కువగా నుండెను. వామదేవుని యజ్ఞమునకు వచ్చిన గంధర్వులు ఆ వనములో తిరుగుచు, అచట అనాగరికులై నగ్నముగాయున్న కోయస్త్రీలను జూచిరి. వారి నగ్నసౌందర్యము గంధర్వులలో కామవాంఛ కలిగించెను. వెంటనే వారు యజ్ఞవిషయమును మరచి యుచితానుచితములు లేక వారితో రతిక్రీడలు సలుపుచు కాలము గడిపిరి.

యజ్ఞము పూర్తి అయినది. వామదేవుడు యజ్ఞభాగములు దేవతలకు, దేవగణములకు పంచిపెట్టెను. వారిలో ఆయనకు గంధర్వులు కానరాలేదు. అతడు తనయోగదృష్టితో గంధర్వుల నీచకృత్యము గాంచెను. వారి యాగడమునకు వామదేవుడు కోపించెను. కిరాతకులు కమ్మని వారిని శపించెను. ఈ శాపమును వారు నారదునివలన తెలుసుకొనిరి. భయకంపితులైరి. పరుగు పరుగునవచ్చి వామదేవుని పాదములపై బడిరి. తనశాపము తిరుగులేనిదని వామదేవుడు చెప్పెను. దీనాతిదీనముగ వారు వామదేవుని ప్రార్ధించిరి. కనికరించి. అతడు శాపాంతము అనుగ్రహించెను. కలియుగారంభము ఈశ్వరుడు లింగమున ముఖము దాల్చి యిచట యిప్పచెట్టు మొదట వెలియును. ఆ ముఖలింగేశ్వరుని దర్శించిన మీకు శాపవిమోచనమగును; అని తెలియజేసెను. ఆ ముఖలింగేశ్వరుడే నేటి శ్రీముఖలింగేశ్వరుడు.

7. ఓ ఈశ్వర! శ్రీముఖలింగమునందలి నీగుడి పంచధాత్రాయతనమై మిక్కిలి పావనమైనది. శ్రీకాలభైరవుడు యుత్తర దిశాభిముఖముగ, వారాహి అమ్మవారు దక్షిణదిశాభిముఖముగ విఘ్నేశ్వరస్వామి యుత్తర ముఖముగా, నుండి భక్తులకు సంతోషమును కలుగజేయుచున్నారు. కుమారస్వామి పశ్చిమ దిశయందు నెలకొనియుండెను. ఏకపాదరుద్రుడు యుత్తర ముఖముగా నుండెను. పంచబ్రహ్మలు నెలకొనియున్న గుడి పావనమైనది.

8. కమలారి వాసరము: చంద్రుని వాసరము (సోమవారం)
మందవారము: శనివారము

భావము: కార్తీక సోమవారములందు భక్తితో నీపూజ సేయువారు, మాఘమాస బహుళ చతుర్ధశి (శివరాత్రి ఆ దినము లింగోద్భవము జరుగును) జాగరణము సేయువారు, కార్తీకమాసమున నీ గుడివాకిట ఆకాశదీపము నిలుపువారు, శనిత్రయోదశిని రుద్రాభిషేకము చేయువారు మిక్కిలి పుణ్యవంతులు వారికి మరుజన్మము కలుగదు వారికిమోక్షము అరచేతియుందుండును.

9. ప్రత్యూషము: ఉదయకాలము; సుమ: పూలు; తోయము: నీరు; పత్రములు; ఆకులు; ఈప్సితార్ధం: కోరినకోర్కులు

10. భావము: తూర్పునగల కొండపై మాధవస్వామి ఆలయము గలదు. ఆయన శ్రీముఖలింగ క్షేత్రపాలకుడు. పద్మనాభ స్వామి ప్రక్కనే దక్షిణమందు మంకణేశ్వరుడు వెలసి యున్నాడు. స్వప్నేశ్వరుని దర్శించిన యెడల దుస్వప్న ఫలితములు నివారణమగును. ఈ స్వప్నేశ్వరుడు భీమేశ్వరుని ప్రక్కనే వెలసెను. సూర్యునిచే ప్రతిష్టించబడిన లింగము గలదు. దీనిని పూజించిన వారికి చర్మరోగములు నివారణ మగును.

ఇట్టి పవిత్ర క్షేత్రములెన్నియో కలిగియున్న శ్రీముఖ లింగము కాశీనగరముతో సమానమైనదని ప్రసిద్ధిగలదు. త్వగోగ్రములు చర్మవ్యాధులు.

11. భావము: వంశధారానదీ పవిత్రజలములతో స్నానముజేసి శ్రీముఖలింగేశ్వరుని దర్శనము జేసుకొని; పంచబ్రహ్మలను ఆరాధించి, వారాహి అమ్మవారికి కుంకుమపూజచేసి, సోమేశ్వరస్వామిని శ్రీ భీమనాధుని దర్శించి, ధ్యానించి, తీర్థప్రసాదములు సేవించి ప్రమధగణములను కొల్చిన భక్తులకు తీరని కోర్కులుండవు.

మానవాళి: మానవుల సమూహము; మహితకోర్కులు: గొప్ప వైన కోర్కెలు; ఉర్వి: భూమియందు; సుజనపాల; మంచి వారిని రక్షించువాడ; ఉరగహార: పాములు హారముగా గలవాడ.

12. ఒకవంక: ఒకప్రక్క; అకలంకముగ: తొట్రుపాటుతనములేక మకుట కిరణజాలము: కిరీటపు కాంతులు; పుఱ్ఱె: కపాలము సుదర్శనము: విష్ణువుయొక్క చక్రము; కంకాళములు; పుఱ్ఱెలు హరిహరాద్వైతము: శివకేశవులు ఒకటి అని తెలుపునది.

ఈ పద్యమునకు ప్రేరణ శ్రీముఖలింగేశ్వర ఆలయ ఆగ్నేయమూలగల చిన్నగుడిపై చెక్కబడిన శిల్పమూర్తి. అది హరిహర బ్రహ్మము. ఇది శివకేశవులు యొకటే అని తెలియజేయుచున్నది. శైవులు వైష్ణవులు మతవిభేదములతో కొట్టిమిట్టాడుచున్న ఆ దినములలో గూడ శివకేశవులకు భేదములులేదని మతసామరస్యమును బోధించుటకు చెక్కబడిన శిల్పమిది. ఇది అఖండ పరమేశ్వరరూపమని తెలియజేయుటకు చెక్కినారు.

భావము: ఓ ఈశ్వర! శిరసున కుడిప్రక్క చంద్రవంకను, ఎడమ ప్రక్క కాంతులను విరజిమ్ము కిరీటమును ధరించినావు. కుడి చేతియందు పుఱ్ఱె ఎడమచేత సుదర్శన చక్రమును ధరించినావు. కంఠమందు కుడిప్రక్క మానవకంకాళముల మాల, వేఱొక ప్రక్క ముత్యాలహారము ముచ్చట గొల్పుచున్నది. లలాటమున తిలకమువలె నీ నేత్రము మెరయుచున్నది వక్షమునందు కౌస్తుభమును ధరించి శివకేశవమూర్తివై వెలుగుచున్న నిన్ను పూజించి ప్రార్థింతును.

13. చిన్మయలింగము: పరతత్త్వస్వరూపమైన లింగము; పాప తతులు: పాపముల సమూహము; అక్షీణభాగ్యములు; తరగని

సంపదలు; అజుదేవతాకోటులు: బ్రహ్మదేవతలు మొదలగువారు భావము సులభము.

14. శ్రీముఖలింగేశ్వరునకు మధుకేశ్వరుడని మరియొక నామమున్నది. మధూకమనగా యిప్పచెట్టు. ఇప్పచెట్టు మొదల వెలసిన లింగము గాన మధూకలింగము.
వీక: పూని; తుహినాంశు మతుట; చంద్రునితలపై ధరించిన వాడ; దురితము: పాపములు; భావము సులభము.

15. హేమపుష్ప మంజరులు: బంగారు పూల మొత్తములు; ఈ పద్యమందలికథ శ్రీముఖలింగక్షేత్ర మహాత్మ్యమును తెలియ జేయును.

వామదేవుని యాగమునకు వచ్చిన గంధర్వులు మహర్షి శాపకారణముగ కిరాతులుగా మారినట్లు 6వ పద్యమందలి పురాణగాథ వలన తెలియుచున్నది.

వామదేవుని శాపకారణంగా గంధర్వులు కిరాతులుగా మారి ఆ వనంలోని కోయస్త్రీలతో కాపురం చేసారు. ఈ కిరాతులరాజు చిత్ర సేనుడు. ఇతని భార్య చిత్తిని. ఈ వనమునందు గల యిప్పచెట్లలో నొకచెట్టు మిగిలినవాటి కన్న మిక్కిలి భిన్నముగానున్నది. దాని మొదల పెద్ద పుట్టగలదు. మిగిలిన యిప్పచెట్లు వాటి వాటి కాలంలో మాత్రమే పూలు పూయగ, ఈ విచిత్రమైన చెట్టు సర్వకాల సర్వావస్థల యందు యిప్పపూలను యిచ్చేది. ఈ యిప్పచెట్టురాజైన చిత్రసేనుడు తన భార్య చిత్తినికి యిచ్చేడు.

ఆమె ప్రతిదినం ఆ యిప్పచెట్టు నుండి పూలను యేరి, సమీపములోగల సుమంతపురం తీసుకొనిపోయి, అచట కోమటికి వానిని అమ్మి యింటికి అవసరమైన వెచ్చాలు కొని తెచ్చేది.

కొంతకాలానికి చిత్కళ యను పేరుగల జంగమురాలు

(శివభక్తురాలు) శ్రీశైలంనుండి కాశీనగరం వెళ్తూ దారితప్పి చిత్రసేనుడు ఉన్న అరణ్యానికి వచ్చింది. ఆమె సౌందర్యం చూచి చిత్రసేనుడు ఆమెను తనదానిగా కమ్మని కోరాడు. చిత్కళ గూడ చిత్రసేనుని పట్ల ఆసక్తి కనపరిచింది. తొలిభార్య చిత్తిని అనుమతితో చిత్రసేనుడు చిత్కళను వివాహం చేసుకొన్నాడు. తన ఆధీనంలోయున్న యిప్పచెట్టు రెండుకొమ్మలు యిద్దరి భార్యలకు చెరి ఒకకొమ్మ యిచ్చాడు. దినమునకు యొకరి వద్దవంతున యిద్దరి భార్యలవద్ద చిత్రసేనుడు కాపురముండేవాడు. ఎవరి వంతునకు వచ్చిన యిప్పచెట్టు కొమ్మలను వారు దానినుండి సేకరించినపూలను అమ్మి యింటిని గడిపేవారు.

చిత్కళ మిక్కిలి శివభక్తురాలు. అందుచే ఆ యిప్పచెట్టు మొదల గల పుట్టనే శివలింగముగా భావించేది. నిత్యము వంశధారా నదిలో స్నాన్నముచేసి యీశ్వరుని మిక్కిలి భక్తితో పూజించేది. ఆమె భక్తికిమెచ్చి యీశ్వరుడు ఆమె వంతునకు వచ్చిన యిప్పచెట్టు కొమ్మకు బంగారు పూలు పూయించాడు. ఆమె వాటిని సుమంతపురంలో అమ్మి భర్తకు పంచభక్ష్య పరమాన్నములు అమర్చేది. చిత్తిని వంతునకు వచ్చిన దివంమాత్రం చిత్రసేనుడికి గంజినీరే లభించేది. అయినా చిత్ర సేనుడు సరిపుచ్చుకొనేవాడు. కాని పెద్దభార్య చిత్తిని యీర్ష్యచే తగవు పెట్టింది. అప్పుడు చిత్రసేనుడు బంగారుపువ్వులు పూసే చిత్కళ శాఖను చిత్తినికి యిప్పించాడు. చిత్తిని శాఖను చిత్కళకు యిచ్చాడు. చిత్కళ తనవంతుకు వచ్చిన శాఖచే భక్తితో పూజించింది. అశాఖనుండి మాత్రమే బంగారుపుష్పాలు లభించేవి. ఈ విచిత్రం గమనించిన చిత్తిని మరింత యీర్ష్యాసూయలకు గురిఅయింది. ఆమె సవతి అయిన చిత్కళతో ప్రతి దినం దెబ్బలాడేది.

ఈ సవతుల కలహాన్ని చిత్రసేనుడు భరించలేకపోయాడు యిప్పచెట్టు యొక్క పక్షపాత వైఖరియే దీనికంతకు కారణమని తలచాడు తన అశాంతికి కారణమైన యిప్పచెట్టును మొదలంటనరికి వేయాలని తలచి, ఆ మధూకవృక్షాన్ని నరికివేసాడు దానిమొదట వెలసిన శ్రీముఖ

లింగేశ్వరు (మధుకేశ్వరుడు) లింగము నుండి ప్రసరించిన దివ్యకాంతు లకు చిత్రసేనుడు చైతన్యము లేక క్రింద పడిపోయాడు. చిత్రిని ఇదంతా చిత్కళ మాయాజాలమని బిగ్గరగా యేడ్వడం ప్రారంభించింది. అంతట కిరాతులువచ్చి చిత్కళను చంపుటకు ప్రయత్నము చేసారు. చిత్కళ మాత్రం నిశ్చలంగా ఆ మధుకేశ్వరుని ధ్యానించింది.

అంతట శ్రీముఖలింగేశ్వరుడు ప్రమధగణములతో ప్రత్య క్షమయ్యాడు. ఆ పరమేశ్వరుని దర్శనతో కిరాతులకు శాప విముక్తి అయ్యింది. వారు మరల గంధర్వులయ్యారు. ఈశ్వరుడు వారికి శివలోక వాసాన్ని ప్రసాదించెను.

16. సరి, పని, ఎన, దొర: ఈ నాల్గుపదములకు సమానమని యర్థము; వాఱు: ప్రవహించు; కతన: కారణమున; వార ణాశీభవవాసము: ఈశ్వరుని నగరము కాశీనగరము; ముక్తి వాటి; మోక్షమునిచ్చు ప్రదేశము కాశీనగరము: జన్నింపు వాటి: యజ్ఞవాటిక కాశీనగరము; మోక్షధాయము: మోక్షము నకు నిలయము; భావము సులభము,

17. బహుతీర్థశోభిత: అనేక తీర్థములతో శోభించునది; మృత్యు హరము; మృత్యువుని హరించునది; హిమకరు వాసరములు సోమవారములు.

భావము: అనేక పవిత్ర తీర్థములుగల శ్రీముఖలింగక్షేత్రము మృత్యు వును హరించును. ఇచ్చటగల కోటి తీర్థమునందు మాఘ మాసమున స్నానము చేసిన భారతదేశ సమస్త నదులందు స్నానముచేయు పుణ్యఫలమును బొందెదరు. వారి పాపములు నాశనమగును. ఇచటి సోమేశ్వర లింగమును చంద్రుడు ప్రతిష్టించి, తన కుష్టురోగమునకు పోగొట్టుకొనెను. శ్రావణ మాస సోమవారములందు యీ పవిత్రక్షేత్రమున పూజలు జేయువారు మిక్కిలి పుణ్యమును హొందుదురు.

18. శివసాంబ సాయుజ్యము: శివలోకవాసము అనగా మోక్షము స్వర్ణముఖరి: సువర్ణముఖినది. కాళహస్తి ఆలయము ప్రక్క ప్రవహించుచున్నది; విశ్వేశదేవునిపీఠు: కాశీనగరము; కైవల్య సంప్రాప్తి: మోక్షమునందుట; విబుధచక్రవర్తి: దేవతలకు రాజు.

భావము: శ్రీశైలమునందు మల్లికార్జునదేవుని శిఖరము దర్శించిన శివలోక పదవి లభించును. సువర్ణముఖియందు స్నానము చేసి కాళ హస్తీశ్వరుని దర్శించిన ముక్తి లభించును. నివాసమాత్రముచే కాశీయందు మోక్షము లభించును. శ్రీముఖలింగము నందు శివుని ముఖదర్శనముచే ముక్తి గలుగును. ఓ యీశ్వరా! నిన్నుమించిన దైవములేదు. అన్నివేదములు నీగూర్చి తెలియు జెప్పుచున్నవి. సకల దైవములకు నీవు రాజువు.

19. దృక్కర్ణధారి: పాములను ధరించువాడ; దృక్కర్ణము: పాము చంద్రార్థచూడ: కొప్పునందు అర్ధచంద్రుని దాల్చువాడ భవరోగభయము: పుట్టుట అనెడి భయము (సంసారభయము) సర్వార్తి దుఃఖభయము: అనేక బాధలవలన గలుగు దుఃఖము శైలజ; పార్వతీదేవి; అధిప: ప్రభువు (భర్త) అయినవాడ క్రాలు: మండుచున్న; తాపత్రయంబులు: మూడు తాపములు

20. ఓ శ్రీముఖలింగవాస! నీ ఉన్నతత్వమును నేను సదాస్తుతిం చెదను. ఈతి బాధలనుండి విముక్తిజేయుము. నీ ప్రభావమును ప్రస్తుతించెదను. నేను పాపిని నన్ను కాపాడుము. నీవు ఆర్త రక్షకుడవు నిన్నునే కీర్తింతును. ఓ సర్వమంగళరూపా! నన్ను రక్షింపుము. ఓ పార్వతీపతి నా పాపములు పోగొట్టి నాకు నరకలోక వాసము తప్పించుము.

21. ఈ పద్యము ఈశ్వరుని నామసంకీర్తనము; చిద్రూప: ఆత్మ స్వరూప; సర్వభువనవంద్య: అన్నిలోకములవారిచే నమస్కా

రములందువాడ; సంతతాగమవేద్య: ఎల్లప్పుడు వేదములచే విశదమయినవాడ; పాలితాఖిల భక్తజాల: అనేకమైన భక్తులను రక్షించువాడ; భసితపాండు శరీర; విభూతి పూతనిండిన దేహము గలవాడ; గ్రసిత హాలహాల: గరళమును మ్రింగినవాడ; పూతకైవల్యదాత: దుర్లభమై పవిత్రమైన మోక్షము నిచ్చువాడ; భావము సులభము.

22. ఈ పద్యమునందు సృష్టికర్తలైన త్రిమూర్తులకు భేదము లేదు. ముగ్గురును ఒక అంశయే అని తెలియుచున్నది.

ఓ శ్రీముఖలింగవాస! నీయొక్క దయచే యీసృష్టివీక్షణమాత్రము చేతనే కలుగుచున్నది. నీ దయచే యీ సృష్టి పెరిగి పెద్దదగుచున్నది. రుద్రరూపమున నీ అనంతమైన శక్తిచే యీ సృష్టి లయమగుచున్నది. నీ నడవడిని బ్రహ్మాది దేవతలైన తెలియలేకున్నారు.

23. ఈ పద్యము నామసంకీర్తనము ప్రార్థనాపద్యము.

వేధ: బ్రహ్మ; ఆత్మగోచర: నిర్వికల్ప సమాధియందు యాత్మ రూపమున కన్పించువాడ; అవ్యక్త రూప: అట్టిది ఇట్టిది అని చెప్పుటకు వీలులేని రూపము గలవాడ.

24. ఓ శ్రీముఖలింగవాస! దివ్యమైన నీ నామసంకీర్తనము, సంసారమను యేనుగును పరిమార్చు సింహము; మండుచున్న తాపత్రయములను చల్లార్చు వర్షపుధార; పాపములను మేఘముల సమూహమును చెదరగొట్టు గాలి; ఆశలనెడి లతలను తెగగోయు ఆయుధము; అరిషడ్వర్గములను చీకటులను పటాపంచలు చేయు సూర్యుడు (కామక్రోధలోభ మోహ మదమాత్సర్యములు అరిషడ్వర్గములు) దుఃఖమనెడి అడవిని దహించు దావాగ్ని రోగమనెడి మొసలినిఖండించు సుదర్శన చక్రము; జన్మజన్మల కర్మఫలమను కొండలను గూలద్రోయు

వజ్రమై ప్రకాశించును.

కలుష సంహార: పాపములను నాశనముజేయువాడ;

శీతాంశుఖండమకుట: చంద్రఖండమును తలపై ధరించువాడ

25. ఓ శ్రీముఖలింగవాస! అంత్యకాలమున కఫముగ్రమ్మి మాట పెగలదు. శరీరమున వాతముగ్రమ్మ నీ మహిమలను దలచుట మరచిపోదును. మరణ కాలమాసన్నమైనపుడు భార్యాపుత్రుల యెడ మమకారము కలుగ నీ నామసంకీర్తనము చేయజాలను ముసలి తనమున ముడుతలు వాజిన శరీరము మతిస్థిమితము తప్పి నీధ్యానము మరతును. నేటివరకు సంసార సాగరమును యీదుచు నీ నామసంకీర్తనచేయు నేరనైతిని. ఓ మన్మథాంతక నాకు చిత్తమునందు నిర్మలత్వమును ప్రసాదింపుము. నీ సంకీర్తన జేసుకొందును.

26. తరుణేందుశేఖర; బాలచంద్రుని ధరించువాడ; ఘోర + అఘచయము: ఘోరమైన పాపసముదాయము; జరారుజలు ముసలితనము, రోగము; కామాదిరిపులు: అరిషడ్వర్గములు భవమును కర్మంబులేనివాడ: చావు పుట్టువులుగాని పాపపుణ్య కర్మఫలానుభవము గాని లేనివాడ.

27. ఈ పద్యము భక్తితో ప్రతినిత్యము పఠించిన యీశ్వరుని అనుగ్రహము కలుగును.

28. ఈ పద్యమునందు రకరకముల పూలతో యీశ్వరుని పూజింతునని వర్ణింపబడినది. ఇది ప్రతిదినము భక్తితో పఠించిన యీశ్వరుని మాసిక పూజ చేసిన ఫలితము వచ్చును.

29. భూతంబులైదు: భూమి, ఆకాశము, అగ్ని, గాలి, నీరు

భావము: ఓ శ్రీముఖలింగనివాస! హాలహాలమును మ్రింగి కడుపులోని లోకములకు హానికలుగునని కంఠమునందు నిలిపినావు. పాప

నాశని అయిన గంగను తలదాల్చి భక్తులపాపములు బాపినావు పంచభూతములను సృష్టించి సకల ప్రాణులకు జీవసము కల్పించి స్థితికార్యము నెరపుచున్నావు. ఓషధులను పుట్టించి ప్రాణుల రోగభయము పోగొట్టితివి. ఈ సృష్టిని రక్షించుటకు యిన్ని విధములైన కార్యములను జేసినావు.

30. ద్రుహిణసారధి: బ్రహ్మసారధిగా గలవాడ (త్రిపురములను గూల్చునపుడు ఈశ్వరునకు బ్రహ్మసారధి); భవరోగనివారణ సంహార మనురోగమును పోగొట్టువాడ.

భావము: ఓ శ్రీముఖలింగావాస! నా దోషములను ఎత్తిచూపకుము. పాపములను పోగొట్టుము. పూర్వజన్మలో చేసిన చెడుకార్యములను లెక్కింపకు మంచికార్యములేవైనయున్న యెడల లెక్కగొనుము ఇతరులకు సేవజేసి నీ ప్రేమకు పాత్రుడనుగానిమ్ము. మమకారము లేకుండ చేసి పునర్జన్మ లేకుండజేయుము.

31. ప్రణవము ఓంకారము: పరబ్రహ్మస్వరూపము; ఇక్క: నెలవు సద్గతి: మంచిగతి.

భావము: ఏ మంత్రము యొక్క మహిమచే ముక్తిలభించునో, దేనిని గూర్చి వేదములు స్పష్టముగా చెప్పుచున్నావో, సృష్టి ప్రారంభమునుండి నారదాదిమునులు యే మంత్రమును విడువక జపింతురో, బ్రహ్మదిదేవతలు యే మంత్రమును మోక్షస్థామని జపింతురో, పదునాల్గు లోకముల వారికి యే మంత్రము ముక్తి నిచ్చునో, అట్టి నీ పంచాక్షరీ మంత్రమును నిత్యముపఠింతును చావు పుట్టువులులేని బ్రహ్మపదవి నొసంగుము.

పంచాక్షరి: " ఓం నమశ్శివాయ "

32. దక్షప్రజాపతి యజ్ఞమును ధ్వంసము చేసితివి, త్రిపురములను గూల్చివేసితిమి. దారుకావనములో నున్న తపసులను బాధించి

వారి భార్యలను చెరచినావు. చిఱుతొండనంబిచే వానికుమారుడు సిరియాళను జపించితివి. పందిమాంసమును దింటిని. కపాళము నీ భోజనపాత్ర. ఇవి అన్నియు దోషములవలెనున్నను దోష ములు కావు. భక్తులను పరీక్షించి కాపాడుటకు నీవు గావించిన లీలలు.

పూర్వగాథలు : దక్షయజ్ఞము

సృష్టి కార్యనిర్వహణకు బ్రహ్మ సృష్టించిన ప్రజాపతులలో దక్షుడొకడు. బ్రహ్మ కుడికాలి బొటనవ్రేలి నుండి దక్షుడు పుట్టెను. బ్రహ్మ యెడమ కాలిబొటన వ్రేలినుండి పుట్టిన ధరణిని వివాహమాడెను ఈ దంపతులకు సతి, కీర్తి, లక్ష్మి, ధృతి, మేధ మొదలగు 50 మంది పుత్రికలు పుట్టిరి. అయిదుగురు కుమారులు పుట్టిరి.

ఏబది మంది పుత్రికలలోను యెనమండుగురు ముఖ్యులు వారిలో సతి అను నామె పెద్దది. ఆమెను దక్షుడు యీశ్వరునకిచ్చి పెండ్లి గావించెను.

బ్రహ్మలోకమున యొకసారి బ్రహ్మగారి యధ్యక్షమున యొక మహాయజ్ఞము జరిగుచుండెను. ఆ యజ్ఞమును చూచుటకు దక్షుడు బ్రహ్మ లోకమునకు వెళ్ళెను. అప్పుడచట శివుడుగూడ యుండెను. శివుడు దక్షుని జూచెను. యూరకుండెను. తనను శివుడు గౌరవించలేదని దక్షునకు కోపము వచ్చెను. ఆనాటినుండియు దక్షుడు అల్లుడైన శివుని, పుత్రికయైన సతిని (దాక్షాయని) అవకాశము దొరకినపుడెల్ల అవమానించు చుండెను. అందరు కుమార్తెలను పండుగ పున్నమలకు బిలుచునుగాని యీశ్వరుని దాక్షాయణిని బిలువడు. పాపము సతికి పుట్టింటి యందభిమానము మెండు

శివుని యవమానించుటకై దక్షుడు యొక యజ్ఞమును చేయుటకు తలపెట్టెను. అందరి దేవతలను ఆహ్వానించెను. శివుని సతిని మాత్రము యాహ్వానించలేదు, కాని తోబుట్టువులనుజూడ వచ్చుననని ఆసతో సతీదేవి తండ్రి పిలువకపోయినను యజమును చూచుటకు వెళవలెనని

సంకల్పించెను. శివుని అనుమతికోరెను. దక్షుని స్వభావమును తెలసిన శివుడు భార్యను వెళ్ళవద్దని హెచ్చరించెను. శివుని మాటలు పెడచెవిని బెట్టి దాక్షాయణి తండ్రి యజ్ఞమును చూచుటకు వెళ్ళెను.

ప్రవేశద్వారము వద్దనే సతిని జూచిన దక్షుడు మండిపడి పిలువని పేరంటమునకు నీవేలవచ్చితివని దూషించుచు అడిగెను. అంతట దాక్షాయణి తండ్రిని నిలదీసి నేచేసిన తప్పేమి అని అడిగెను. అపుడు దక్షుడు నీభర్త శివుడు అహంకారి. నన్ను అవమానించి ద్వేషించుచుండును నీవలన నాకులగౌరము నాశనమైనది. అని శివుని ఆమెను అనరాని దుర్భాషలాడెను. దాక్షాయణి యీ అవమానమును భరించలేక పోయినది భర్త అయిన శివునే పలుమారులు ప్రార్థించుచూ, తరువాత జన్మలో గూడా యీశ్వరునే భర్తగా పొందవలేనని గోరుచు, ఆమె యోగాగ్ని సృష్టించుకొని తన శరీరమును దగ్ధం గావించుకొనెను.

ఈ వృత్తాంతము విన్న యీశ్వరుడు కోపోద్రిక్తుడయ్యెను భయంకరాకారుడు వీరభద్రుని రుద్రగణములను సృష్టించెను భీకరాకారులై వారందరూ తక్షణమే దక్షుని యజ్ఞమును ధ్వంసముచేసిరి దక్షుని పక్షము వారందరిని సంహరించిరి. ఈశ్వరుడు దక్షుని శిరమును ఖండించెను. దక్షుని భార్య అయిన ధరణి పసుపు కుంకుమలను వేడగా నొక గొఱ్ఱె (పొట్టెలు) తలను దెచ్చి దక్షుని శరీరమునకు అతికించిరి. వానితల కానరాలేదు. అందుచే దక్షునికి అజముఖుడని పేరు వచ్చినది. ఈవిధముగా యీశ్వరుడు దక్షయజ్ఞమును ధ్వంసముజేసెను.

(పూర్వగాథలహరి)

ఈశ్వరుడు త్రిపురంబులను కూల్చు గాథ

విద్యున్మాలి, తారకాక్షుడు, కమలాక్షుడు, అను ముువ్వురును తారకాసురుని కుమారులు. తారకాసురుడు చనిపోయిన తరువాత వీరు ముువ్వురును బ్రహ్మను గూర్చి తపస్సు గావించిరి బ్రహ్మ ప్రత్యక్షమయ్యెను. వీరు చావు లేకుండు నట్లు వరమిమ్మని బ్రహ్మను కోరిరి. బ్రహ్మ అది అసాధ్యమనిచెప్పెను అంతట వారు సకల సౌఖ్యములు

గల మూడు పురములను గోరిరి. ఆ పురములు కామగమనము గలవి అనగా ఇతరులకు కనపడకుండ కోరిన ప్రదేశమునకు పోగలవి ఆమూడు పురములను బ్రహ్మవారి కొసంగెను. అవి మూడును యొకదానితోనొకటి కలియకయున్నంత కాలము వారినెవరును జయించలేరని ఆ మూడు యొకదగ్గర కలసిన యెడల బలహీనులగుదురవి చెప్పి బ్రహ్మ వెడలి పోయెను.

వీరు ముప్వురును మయబ్రహ్మచే బంగారు, వెండి, యినుములతో మూడు పురములను చేయించుకొనిరి. తారకాక్షుని కుమారుడు హరియనువాడు. వాడు మహావిష్ణువు గూర్చి తపస్సు చేసెను. విష్ణువు ప్రత్యక్షమయ్యెను. తమలో ఎవరు చనిపోయినను వారి శరీరములు నీటముంచగానే సజీవులై యొక్కక్కరు పదిమందియగునట్లు వరమును పొందెను. ఈ మూడు పురములయందు మూడు సరస్సులను యేర్పాటు చేసెను. ఇక యీ ముప్వురు రాక్షసులు వారి వారి పురములతో సంచరించుచు దేవతలను నరులను బాధింపజొచ్చిరి.

దేవతలు వీరి బాధపడలేక బ్రహ్మతో మొరపెట్టుకొనిరి. బ్రహ్మ వీరిని తీసుకొని శివునికడకు వెళ్లెను. వరప్రభావులైన యీ రాక్షసులను ముప్వురను చంపుటకు దేవలయొక్క అంశలన్నియు గూడవలెనని యీశ్వరుడువారికిచెప్పి యీ త్రిపురాసురులను సంహరించుటకు సిద్ధపడెను

అంత యీశ్వరునకు భూమిరథముగ, సూర్యచంద్రులు రథచక్రములుగ, వేదములు అశ్వములుగ, బ్రహ్మగారు సారధిగా మేరు పర్వతము విల్లుగా, శ్రీమన్నారాయణుడు అస్త్రముగా యేర్పడిరి. అంతట యీశ్వరుడు కామగమనముగల యీ మూడు నగరములు ఒక చోటికి చేరగానే ఆ పురములను కూల్చివేసెను.

## దారుకావనములోని తపసులను బాధించు కథ;

పార్వతీ కళ్యాణము జరిగిన తరువాత యీశ్వరుడు మావు

గారైన హిమవంతుని యింట యిల్లరికపుటల్లుడయ్యేను. అతడు పూర్వము తాను దహించిన మన్మధుని బ్రతికించి మిక్కిలి గౌరవించెను. ప్రతిదినం చక్కగా సింగారించుకొని పార్వతీదేవిలో రతిక్రీడలలో మునిగి తేలు చుండెను.

శివుని ప్రమధగణములు గూడ శివునితోపాటు హిమ వంతుని నగరమైన ఓషధి ప్రస్థమున తిష్ఠవేసిరి. వీరు అనేక వేలమంది ఓషధీప్రస్థములో అందమైన దేవతాస్త్రీలు యెందఱోగలరు. వారందరును గరుడగంధర్వ కిన్నెరకింపురుషాది దేవతా స్త్రీలు శివుని ప్రమథగణములు ఆ నగరపైబడి ఆగడములు చేయ మొదలిడిరి. వీరి యాగడములకు యోషధీ ప్రస్థమంతయు అట్టుడికినట్లయినది. వెంటనే హిమవంతుడు ఆయన భార్య మేనక పార్వతిని పిలిపించి శివుని దూషించిరి. ఈ విష యము తెలుసుకొనిన శివుడు అలిగి చివరకు భార్యకైనను చెప్పకుండ యిలువిడచి వెడలిపోయెను. దారుకావనమునకు వచ్చి చేరెను. అందు దాక్షాయణీవనము గలదు ఆ వనమందు అనేకమంది ఋషులు తపస్సులు చేసుకొందురు. ఆ ఋషులకు భార్యలున్నారు, మునికన్యలున్నారు. ఋషుల తపస్సులు పాడుచేయుటకు ఇంద్రునిచే పంపబడిన అప్సరసలున్నారు. మిక్కిలి వారందఱును సౌందర్యవతులు

అచ్చట భోగములకు లోటులేదు. ఆ దారుకావనములో శివుడు భిక్షాటనకు బయలుదేరెను. అప్సర స్త్రీలు శివునకు లోబడిరి శివుడు ఋషుల యిండ్లకు భిక్షకైపోయెడివాడు. ఋషులు తపస్సులో నుండగా శివుడు వారి భార్యలతో సరససల్లాపములు సాగించెను. వారి పాతివ్రత్యమును పాడుచేసెను. మునులు దర్భలకు సమిధలకు యరణ్య మునకు పోయినపుడు శివుడు వారి యిండ్లకేగి వారి భార్యలతో రతిక్రీడ లలో తేలియాడుచుండెడివాడు.

మునులందఱకు శివుని యాగడములు తెలిసినవి. వారు యొకనాడు కూడబలుకుకొని శివుడొకరియింట రమించుచుండగా చుట్టిముట్టి పట్టుకొనిరి. అపుడు శివుడువారికి నిజస్వరూపమునుజూపి జగన్మిధ్యాత్వము

ఉపదేశించెను. అంతయు శివమయమని చెప్పి వారిమోహము నివారించెను ( హరవిలాసము నుండి )

## చిరుతొండ నంబికథ ;

కాంచీనగరములో యుత్తముడైన కోమటి యొకడుండెను అతనిపేరు చిఱుతొండనంబి. అతడు పరమమహేశ్వరాచార సంపన్నుడు శివభక్తులు ఎవరేదికోరిన లేదనకుండ యిచ్చు వ్రతము గలవాడు. తప్పిన యెడల తిరుబాస. అట్టి పరమమహేశ్వర భక్తుని చూడవలెనని పార్వతీ దేవి కోరెను. శివుడు వానికి పరీక్ష పెట్టెను.

కొందఱైనను శివభక్తులు తన పంక్తినిలేనిచో చిఱు తొండనంబి భోజనము చేయడు. శివుని యాజ్ఞమేరకు కాంచీనగరముచుట్టు 21 దినములు యెడతెఱపిలేకుండ పాములు వ్రేలగట్టినట్లు దారగట్టి వర్షము కురిసెను. పశువులకు గడ్డి కరవయ్యెను. పొయ్యిక్రిందకు వంట చెరకు లేదు. కాంచీనగరములోనున్న సాధువులు, శివభక్తులు, భిక్షకులు విలవిలలాడిరి. ఎప్పట్టికి వాన వెలసిపోవును కాంచీనగరము వదలి పోవుదమా. అని ఎదురుచూచిరి.

వర్షము కురియుచున్న దినములలో చిఱుతొండనంబి ఆయన భార్య తిరువెంగనాచి వారి యింటికి చేరిన శివభక్తులకు, అభ్యాగతులకు అతిధులకు యిష్టాన్నములు సమకూర్చిరి. పొయ్యిమండించుటకు వంటచెరకు లేనందున క్రొత్త గుడ్డలను నూనెలోముంచి వాటిని మండించి వంట చేసిరి. ఈ విధముగా 21 దినములు గడచినవి.

ఇరువది రెండవదినమున వానవెలసినది, బ్రతుకుజీవుడా యని భిక్షుకులు, శివభక్తులు, సాధువులు, సన్యాసులు అందరును కాంచీ నగరము వదలి మొలబంటి నీటిలో నడచుకొని యితరప్రదేశములకు పోయిరి.

ఆ దినమున చిఱు తొండనంబి ప్పటివలెనే శివార్చనము చేసి

సహపంక్తి భోజనమునకై శివభక్తులను వెదకికొనుచు వీధిలోనికివచ్చెను ప్రతీదినము వేలకువేలు శివభక్తులుండెడి యాతనిముంగిలి నిర్మానుష్యమై యుండెను. అతడు మిక్కిలి ఆశ్చర్యపోయెను. ఈ విషయము భార్యకు చెప్పి శివభక్తులను వెదకుటకు బయలుదేరును. నగరమంతయు దిరిగెను. తిరిగిన వీధిలోనే మగల మరల తిరిగి తప్పిపోయిన గొడ్డును వెదుకురీతి శివభక్తులకై వెదకెను. ఏవరకుయేమిండ జంగమైన కనిపించునని సాని వాడలకు పోయి పరికించెను. కాని యొక్క శివభక్తుడును కానరాలేదు అతడప్పుడు యూరికి రెండు మైళ్ళ దూరములోనున్న యొక పాడుపడిన యాలయమువద్దకు వచ్చెను. అచ్చట నొక ముసలి జంగము కనిపించెను ఆయనకు 80 సంవత్సరములు. మిక్కిలి ముదుసలి. ఆయన భార్య గుడ్డిది ముసలిది. చిఱుతొండ నంబి ఆయన వద్దకు వచ్చి అయ్యా నేడు మీ దంపతులు మా యింటికి శివార్చనకై రావలయునని పిలిచెను.

ఆ ముదుసలికి వణుకు జబ్బున్నది సరిగ మాట్లాడలేక పోవుచుండెను. అయ్యా మరల చెప్పుడని యా ముదుసలి జంగము చిరు తొండనంబిని యడిగెను. తన కులగోత్రములు జెప్పుకొని చిఱుతొండడు మరల రెట్టించి చెప్పెను. అంత నా ముసిలి జంగము " అయ్యా నేను వచ్చెదను. కాని యేడాది నుండియు నిరాహార దీక్షలోయున్నాను. ఈ దినము వ్రతము నకు ముగింపు నీవు యుద్యాపనము చేయగలవా? అని అడిగెను. ఇంకను ఆదినరమాంసముతో చేయవలెనని చెప్పెను ఆ బిడ్డడు నీ స్వంత కొడుకై యుండవలెను. మీదంపతులు మనస్ఫూర్తిగా అంగీక రించి. పిల్లవాని సమ్మతితో వానినిచంపి ఆమాంసము వండి పెట్టవలెను అది శివుని కర్పించి నా వ్రతము యుద్యాపన చేయుదుననెను.

అంత చిఱుతొండడు మహాప్రసాదమని యాతని నియమమునకు అంగీకరించెను. "అయ్యా! నాకు సిరియాలుడను కుమారుడు గలడు. మీ వ్రతమునకు నేను యుద్యాపనచేయుదును, ఈ దినము శివా ర్చనకై రండని చెప్పెను. అంత నా ముదుసలి రూపమువనున్న పరమే శ్వరుడు చిఱుతొండ నంబికి అనేకరకములైన పరీక్షలు పెట్టి వారింటికి

పోయెను. మహా భక్తు లైనచిఱుతొండనంబి వానిభార్య తెరువెంగనాచి యొక్కగానొక్క కుమారుడైన సిరియాలుని వాని అంగీకారముతో చంపి వాని మాంసమును మాయా జంగమునకు బెట్టిరి. అంత పరమేశ్వరుడు వారి శివదీక్షకు మెచ్చెను. సిరియాలుని బ్రతికించెను. చిఱుతొండనితో సహా కాంచీనగరములోగల యేడువాడల వైశ్యులకు శివసాంబ సాయుజ్యం నొసంగెను.

## ఈశ్వరుడు పందిమాంసమునుదిను కథ (తిన్ననికథ)

పొత్తపినాట యుడుమూరను నొక బోయపల్లె గలదు. దానికి రాజు నాథనాదుడు. అతని భార్య తందె. వారి కుమారుడు తిన్నడు తిన్నడు యొక దినమున వేటకు పోయెను. రకరకముల వేటలాడి యలసి పోయి యొక పొగడ చెట్టునీడ నిద్రించెను, అంత వానికి కలలో శివుడు సాక్షాత్కరించి "ఓరీ కుఱ్ఱవాడ! ఇక్కడకు దగ్గరలోగల కొండదగ్గరనున్న మర్రిచెట్టు క్రింద శివుడున్నాడు. ఆతనిని పూజింపుము " అని చెప్పెను తిన్నడు యులికిపడిలేచెను. అంత వానికి యొక అడవి పంది కనపడెను. దానిని తరుముకొని తిన్నడు వెళ్ళెను. అది శివుడున్నచోటికి వానిని దీసుకొనిపోయి మాయ మయ్యెను. అచ్చట శివలింగమును గాంచిన తిన్నని యొడలు పులకించెను. ఆ శివలింగమునకు నమస్కారము చేసెను. మిక్కిలి భక్తితో శివుని తనయూరైన యుడుమూరు రమ్మని పరిపరి విధముల తిన్నడు ప్రార్థించెను.

శివుడు పలకలేదు. చివరకు తిన్నడు శివుడిచ్చట ఆకలితో పడియున్నాడని యెంచెను. అరణ్యములోనికి పోయెను. ఒక బలిష్టమైన పందిని వేటాడెను. దాని మాంసము చక్కగా కాల్చిప్రేల్చెను. ఆ మాంసపు ముక్కలను ఆకు దొప్పలలో పెట్టుకొని శివుని యొద్దకు వచ్చి తినుమని బ్రతిమాలెను. శివుడు చలించలేదు, తిన్నడు యేడ్చెను. మొత్తుకొనెను శివునకు దయకలుగలేదు. చివరకు తిన్నడు ప్రాణత్యాగమునకు సిద్ధపడెను అంత శివుడు వానికి ప్రత్యక్షమై వాని పూజను స్వీకరించెను ఈ విధంగా

తిన్నడు ప్రతిదినము మాంసపు ముక్కలను తెచ్చుచుండెను. శివుడు వానిని పరమానందముతో తినుచుండెను.

ఆ శివాలయమునకు అర్చకుడైన శివబ్రాహ్మణుడు ఒక దినము గ్రామాంతరము నుండి వచ్చెను. శివుని గర్భగుడి యందు గల యెంగిలి దొప్పలను, మాంసపు దుమ్ములను చిందర వందరగా పడియున్న పూజాద్రవ్యములను చూచి మిక్కిలి దుఃఖించెను. "ఓ శివా! నేను మిక్కిలి పరిశుభ్రముగ అలికి ముగ్గులు వెట్టి వెడలితిని. ఈ అపరి శుభ్రమెట్లు కలిగినది చెప్పుమని నిలదీసెను. చివరకు ప్రాణపరిత్యాగమునకు సిద్ధ పడెను. అంత శివుడు ప్రత్యక్షమైవానికి తిన్నని మూఢభక్తి గూర్చి చెప్పెను. అతడిపుడే యిచటకువచ్చును. నీవును వాని భక్తినిగనుమని చెప్పెను. ఈశ్వరుని లింగము వెనుక శివబ్రాహ్మణుడు దాగికొనెను.

ఎప్పటివలె తిన్నడు రెండు చేతులయందు దొప్పలతో మాంసము, నోటియందు అభిషేకమునకై సువర్ణముఖి జలముకొని వచ్చెను. తన చెప్పుకాలితో శివలింగము చూట్టుగల నిర్మాల్యమును యూడ్చి శుభ్రపరచెను. పుక్కిటనున్న నీటిని శివలింగముపైనభిషేకించెను మాంసపు ముక్కలను దినుమని యర్థించెను. కాని ప్రతిదినమువలె యీశ్వరుడు మాంసపు ముక్కలను తినలేదు. తిన్నడు కారణము తెలియక మథన పడుచుండెను. అంతట యీశ్వరుని కంటినుండి నీరుకారజొచ్చెను పాపము మహాభక్తుడైన తిన్నడు కంటిబాధవలననే యీశ్వరుడు మాంసపు ముక్కలు తినుటలేదని యనుకొనెను. ఆ కంటికి వైద్యము ప్రారంభిం చెను. నీరుకారుట యెక్కువకాజొచ్చెను, తనకు తెలిసిన మందులు యితరులు వాడగ చూచిన మందులు యితరుల నుండి తెలుసుకొనిన మందులు అన్నియువాడెను ఎన్నిమందులు వాడినను తగ్గలేదు. కంటినుండి రక్తముకారజొచ్చెను. చివరకు తిన్నడు కంటికి కన్నే మందని భావించెను. తన అమ్ములపొదినుండి యొక వాడియైన బాణమునుతీసి తన కంటిని యూడబెరకి, రక్తముకారుచున్న యీశ్వరుని కంటికి అమర్చెను. అంత శివుని కన్ను బాగైనది. ఇంతకు మున్నుకన్న

కన్ను మిక్కిలి అందముగనున్నది.

ఇంకను పరమేశ్వరునకు భక్తునిపట్ల సంతృప్తి కలుగ లేదు. శివుడు తన రెండవ కంటి నుండి నెత్తుటిని కార్చజొచ్చెను. అంత తిన్నడు స్వామి! నీదయవలన నీ కంటిమందు నేను తెలుసుకొంటిని కావి నీ మూడవ కన్ను నెత్తురుగారిన యెడల నాకుజ్ఞాన నేత్రమును యిమ్ము దానిని నీ మూడవ కంటికి అమర్చెదను. అనిచెప్పి తనకాలి బొటనవ్రేలు యీశ్వరుని రెండవ కంటిని గుర్తునకై పెట్టి తన రెండవ కంటిని బాణముతో పెకలించుటకు సిద్దపడెను అంతట శివుడు ప్రత్యక్షమై తిన్ననికి, శివబ్రాహ్మణునకు మోక్షమిచ్చెను.

33. విరూపనేత్ర: అసమ నేత్రములు ( మూడు ) కలవాడ ఆశాపాశములు: ఆశ అనెడి త్రాళ్లు; కుధర ధన్వి కొండను ధనస్సుగా గలవాడ,

భావము: ఓ శ్రీముఖలింగవాస! వయను మళ్లినను మనసు యౌవనవతులైన కాంతల శరీరభోగములనే కోరును. భార్యాబిడ్డలయందు ఆస్తి పాస్తులయందు మోహము పెంచుకొనునేగాని త్రెంచనీదు. తీవ్రమైన కోరికలు, కొనలుసాగెడి లతలవలె మనసునందు మొలకెత్తుచునేయుండును. దానధర్మాది సత్కర్మలు జేయుటకు ప్రోత్సహించదు. ఓ యీశ్వర యీ మనసుయొక్క మదమణి గించి నీపాద రాజీవములను ధ్యానముచేయుటయందు సంకల్ప మును గలుగజేయుము.

34. అంబరాంబరా: ఆకాశమే బట్టగాగలవాడ; పచ్చియేనికతోలు: పచ్చిదైన యేనుగు చర్మము; పచ్చడంబు: పైబట్ట; భుజగ సంతతి: పాముల సమూహము; శుద్దవారి: నిర్మలమైననీరు.

భావము: ఓ శ్రీముఖలింగేశ్వర! నీవు మిక్కిలి నిరాడంబరుడవు. పట్టు పీతాంబరములు నీకులేవు పచ్చిదైన యేనుగు చర్మమే నీపయి బట్ట. ముత్యాలహారములు నీకు అక్కరలేదు. పాములే నీ

ఆభరణములు. పన్నీరు పాలుపెఱుగులు నీవు కోరవు, అభిషేకమునకు పరిశుద్ధమైన నీరుజాలు. భక్తులేవి యొసంగిన ఆ పూజ ద్రవ్యములనే స్వీకరింతువు. నిన్ను నిశ్చల భక్తి పూజించు వారిని కరుణా సముద్రుడవై రక్షింపుము.

35. భావము: ఓ శ్రీముఖలింగవాస! పవిత్రమైన విభూది శరీరమున ధరించి నిన్ను సదా ధ్యానించు మహనీయులు, తలయంతయు జడలుగట్ట రుద్రాక్షమాలికలు ధరించి నిన్ను నిత్యము జపించు తపోధనులు నిత్యము నీయొక్క పవిత్రమైన పంచాక్షిరీ మంత్రమును నిష్టతో జపించు నియమపరుల, యిహలోక సౌఖ్యములందు విరాగులై నిత్యము సత్యవ్రతము నాచరించు సుజనలు, నీయొక్క మూర్తులే అట్టివారి పాదపద్మములకు నేను నమస్కరించెదను.

36. భావము: ఓ శ్రీముఖలింగవాస! నిత్యము శివశివాయని జపము సేయు వారికి క్రూరమృగములను సహితము భయపెట్టు దావాగ్ని, మంచుగ మాఱిపోవును. మందరాది మహాపర్వతములను సహితము ఖండింపగలుగు వజ్రాయుధము, మెత్తని పూవువలె మాఱిపోవును. అతిలోతైన సముద్రభాగములపై భూమిపైవలె నడువగలరు. కాలకూట విషము గూడ రుచికరమైన ఆహారముగా మాఱును! నీనామ జపము నిర్మలమైన మననున నిశ్చలముగా ధ్యానించు వారికి సాధ్యముకాని దేదియను యుండదు,

37. భావము: ఓ శ్రీముఖలింగవాస! ఈ సంసారము జీవులను కొనునటల తీయనైనదిగాదు ఇది అంతయు నీవు కల్పించు మాయ. జీవులు తాపత్రయపడుట, ధనము సంపాదించుట అంతయు నీమాయ. ఈఆస్తులు భవనము నీమాయ. అందమైన శరీరము ఆలుబిడ్డల బంధములు నీవు కల్పించిన మాయ నీచే కల్పించబడిన మాయజీవిని కప్పివేసి సత్యపదార్థమైన నిన్ను

తెలియనీకున్నది. ఈ మాయను ఛేదించు శక్తి నాకు ప్రసాదింపుము.

38. నిత్యము నీ నామసంకీర్తన చేయువారలకు, నీ ఆలయములు కట్టించి జన్మధన్యము చేసికొను వారలకు, నీ దివ్య చరిత్రలను అచ్చువేయించువారలకు నీ భక్తులను నిత్యము ఆదరించి సంతృప్తివరచువారలకు, నేను పాదాభివందనము చేయుదును. అట్టి పుణ్యజనులను దయతో కాపాడుము.

39. నాలుగువేదములు. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము; షడంగములు: శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము; చతుర్విధ విద్యలు: అన్వీక్ష (విజ్ఞానము) త్రయి (ధర్మాధర్మములు తెలియజేయునది) వార్త (అర్థానర్థములు తెలియజేయునది) దండనీతి (నియానియమములు తెలియజేయునది); షడ్విద్యలు ఆకర్షణ. స్తంభన, మారణ, ఉచ్చాటన, విద్వేషణ, మోహన

భావము: ఓ శ్రీముఖలింగేశ్వర! వేదములను క్షుణ్ణముగా పఠించవచ్చును చతుర్విధవిద్యలు నేర్చవచ్చును. ఆకర్షణాది ఆఱు విద్యలు అభ్యసింపవచ్చును. క్రియ, కృత్తు, తద్ధితాదులైన సర్వ సాహిత్య లక్షణములు తెలుసుకొనవచ్చును. గాని ముక్తిదాయకమైన భవదీయ కరుణ, నిరంతర నీనామ స్మరణము లేనిదే సాధ్యము కాదు.

40. ఓ శ్రీముఖలింగవాస! పవిత్రమైన నీ పంచాక్షరి అను మంత్రము నిత్యము పఠించువారినీ పావనమైన అభిషేకతీర్థమును నిత్యము పొందెడివారినీ పవిత్రప్రసాదము నిత్యము లభించు వారి, నీ దర్శనభాగ్యము నిత్యము లభించువారి భాగ్యమే నిజమైన భాగ్యము నీవు భక్తులను రక్షించువాడవు, భక్తుల పాపములు హరించువాడవు.

41. ఓ కామదహన! నీ పావననామము యెల్లవేళ జపియింప

గలుగుట, నీభక్తవరులతో సంభాషించుట, నీలీలలు కొనియాడి మహిమను పొందుట నిజమైన జన్మసాఫల్యము. అట్టివారు ధన్యజీవులు. నీ భవ్యచరిత్రలు నిత్యము పఠింపగలుగుటే జన్మ సార్థకత. నీ మహాలింగ దర్శనము సమస్తపాప హరము వేదముల సారాంశమే నీవు.

42. చాతకవ్రాతము: చాతకపక్షుల సమూహము; శరశ్చంద్ర జ్యోత్స్నలు: శరత్కాలపు వెన్నెలలు; ఫుల్లాబ్జ: వికసించిన పద్మముల యొక్క; గర్భ: లోపలిభాగమున; హృత్ఫుల్ల వికసించిన హృదయముగల; భృంగసముదయము: తుమ్మెద ల సమూహములు మకరందమాను: తేనెనుత్రాగు; విస్మయా నంద: బ్రహ్మానంద స్వరూపుడవైన ఓ పరమాత్మ; సంతతా నంద పథము ఎడతెగని ఆనందమార్గము.

భావము: ఓ శ్రీముఖలింగవాస! చాతకములు తొలకరివర్షములకు మహానందము చెందునట్లు, చకోరపక్షులు ప్రీతితో శరత్కాల వెన్నెలను జుర్రునట్లు వికసించిన తామరపద్మముల గర్భమందు చేరి. ఆనంద హృదయముతో తుమ్మెదలు మకరందమును త్రావునట్లు, నూతన వసంతపు మహనీయ శోభకు గొంతెత్తి గానముచేయు కోయిలవలె, బ్రహ్మానంద రూపుడవైన నీ మహ నీయమూర్తిని చింతనజేసి, నిరంతర ఆనందపథమున విహరింతును.

43. ఓ శ్రీముఖలింగవాస! మహిమగల నీ పంచాక్షరి (ఓం నమ శ్శివాయ) మంత్రము యెల్లమంత్రములకు రాజువంటిది. ఆ మంత్రరాజము పాపములనెడి చీకటులను పాఱద్రోలు సూర్య కాంతి. మోక్షమునకు మార్గము చూపు కరదీపిక (టార్చిలైటు) జీవుల తాపత్రయములను మేఘములను పాఱద్రోలు శక్తివంత మైన గాలి మిక్కిలిలోతైన దాటుటకు సాధ్యముగాని సంసార సముద్రము నీదుటయందు సహాయపడు నావవంటిది, సహస్ర భాను తేజ వేయిసూర్యుల ప్రకాశము గలవాడ.

44. ఇరవు; ఇల్లు; తృషాతురుడు; దాహముతోనున్నవాడు: ప్రప! చలివేంద్రము బృందారకులు: దేవతలు; ఆర్తజనులు! మహా బాధలలోనున్నవారు,

భావము: ఓ ఫాలలోచనా! నీయొక్క దయ అనెడి ధనము మోక్షమునకు సెలవు భోగ భాగ్యములు కలుగజేయు గొప్పనిధి, సాధుజనులకు రక్ష; అన్నికార్యములయందు జయమును కలిగించునది. సంసారమునుండి జీవుని విముక్తికలిగించి మోక్షమునొసంగు మూలశక్తి. దప్పికతోనున్నవారికి చలివేంద్రము. కోరిన వారికి కళ్యాణములు కలుగజేయు కల్పవృక్షము వంటిది మృత్యువు కోరలను నాశనము చేయునది. దేవతలకు రక్షణ కల్పించునది. రోగార్తులకు ఔషధమువంటిది అట్టి నీ దయను మాపై కలుగజేసి మమ్ము కాపాడుము.

45. ఈపద్యము నిత్యము పఠింపదగినది, శివ అష్టోత్తరములోని నామములు యిందుగలవు. పరమేశ్వరునకు నిత్యము జయము అని దీనిభావము.

46. జ్ఞానాగ్ని; జ్ఞానమనెడి అగ్ని; దగ్ధమౌకర్మంబు గలవారు:- దహించబడిన పూర్వజన్మల కర్మము గలవారు; చిత్ + మూర్తి చిన్మూర్తి: బ్రహ్మానందమయమైన పరబ్రహ్మస్వరూపము,

భావము. బ్రహ్మజ్ఞానమనెడి అగ్నిచే జన్మజన్మల కర్మమును దగ్ధముచేసికొని విరాగులైనవారు, నీ పరతత్వరూపమును గాంచి సిద్ధులైనవారు, గురువులను నిత్యం పూజించి చిత్తశుద్దితో నుండువారు, తమ విధినిర్వహణలో లోపము లేకుండ నిరంతరము నీ చింతనజేయువారు నిష్కామ కర్ములై సర్వమానవాళిలో నీరూపము, దర్శించి వారిసేవయే నీ సేవగా బావించువారు చావుపుట్టుకలేని పరమ పదవిని నీ లోకమున పొందెదరు.

47. ఓ శ్రీముఖలింగవాస! ముసలితనము, రోగములు, భయము అపదలు ఆర్తిలేనట్టిదియు, ఆకలిదప్పులు లేశమైన లేనిది,

భ్రమలకు ఆశలకు సెలవుకానిది, శోకమోహములచే చికాకు పరుపనిది, సంసారమందలి ఈతి బాధలు లేనట్టిది, సచ్చితానందమై యెల్లప్పుడును ఆత్మకు సంతోషము నొసంగునది. యగు నీశివలోకవాసమును. నాకు ప్రసాదింపుము, ప్రతిదినము నీ దివ్యపాదపద్మములను చేరి భజింతును,

48. రాజీవములు; పద్మములు: తోయము; నీరు; ప్రదోషము: సాయంకాలము నిరశనస్థితి: ఉపవాసము; ఆర్జనము: ఋజువర్తనము.

భావము: ఓ శ్రీముఖలింగవాస! నీపాదపద్మములు యభిషేకించు పవిత్ర తీర్థ జలము నిత్యము పొందగలుగువాడు, ప్రతిదినము సాయంకాలము నీ లింగమును నిష్ఠతో పూజించువాడు, బహుళపక్ష చతుర్దశినాడు నీ పూజ నిష్ఠతో చేయువాడు. శివరాత్రి దినమున యుపవాసముండి భక్తితో నిన్ను పూజించు వాడు, పావనమైన శివలోకవాసమును పొందును, నిన్ను నిష్ఠతో పూజించు భక్తులు ధన్యులు.

49 నీదుగేహిని. నీ యిల్లాలు, జీవకదంబు: ప్రాణుల సమూహము కలుషహారిణి:పాపమును పోగొట్టునది జీవకారణము; జీవించుట ప్రధానమైనది, అపవర్గసోపానము: మోక్షమను మెట్టు, అఘవినాశ: పాపములను నశింపజేయువాడ నిశాచరాంత. నిశాచరుల(రాక్షసులు) ను అంతముజేయువాడ; నయగుణాశ్రయ: నీతి న్యాయము మొదలగు గుణములను ఆశ్రయించి యుండువాడ! నిరుపమానందనిలయ: అనిర్వచనీయమైన ఆనందమునకు నిలయమైనవాడ.

50 ఈ పద్యమునందు పరమేశ్వరుని ప్రదోషకాల తాండవనృత్యము వర్ణితము, ప్రదోషము సాయంకాలము సామేనిగైకొన్నదాన: భర్త అర్ధశరీరమును పొందినస్త్రీ (పార్వతి) సన్నుతులనతులు: పొగడ్తలతోడి నమస్కారములు, ద్రుహిణుండు: బ్రహ్మ.

తత్ + గేహిని; తద్గేహిని; ఆయన భార్య సరస్వతి పాకశాసనాదులు; ఇంద్రాది దేవతలు.

భావము; ఓ శ్రీముఖలింగవాస! సాయంకాలమందు తమయొక్క తాండవ నృత్యము మహాద్భుతము అర్ధశరీరము గొన్న లోకమాత పార్వతి రత్నమయ సింహాసనము పైనుండి తమ నాట్యము వినోదించును. సమస్త దేవతలుపొగడ్తలతోడి నమస్కారములు చేయుచుందురు. బ్రహ్మ తాళములు చేబూని ద్రుత తాళాదులను వాయించును. సరస్వతి వీణ వాయించును. పద్మనాభుడు మృదంగము వాయించును ఇంద్రాది దేవతలు పొగడుచుండగా వెలుగొందు నీనట రాజ మూర్తికి నేను వందనములు చేయుదును.

51, 52 ఈ రెండు పద్యములందు పరమేశ్వరుని షోడశోపచారములతో పూజించుట వర్ణితము వీటిని ప్రతి నిత్యము ఉదయకాలమున పఠించిన యెడల శ్రీముఖలింగేశ్వరుని షోడశోపచార పూజ మానసిక పద్ధతిని జరిపిన పుణ్యము లభించును.

అర్ధాదులు; తక్షకకుండల; నాగులు కుండలములుగా గలవాడ! అంబికేశ; పార్వతీపతి: అంబరాంబర అకాశమే బట్టగా గలవాడ! అఘవినాశ; పాపములను నశింపజేయువాడ! ద్రుహిణసారది; బ్రహ్మ సారదిగా గలవాడ ఫాలనయనా; లలాటమున నేత్రము గలవాడ! ఆర్తరక్ష: భాదలలోనున్న వారిని రక్షించువాడ.

53, భగవంతుని రక్షింపమని గోరుచు నిత్యం పటించదగిన పద్యము యక్షేశసన్మిత: యక్షులకు రాజైన కుబేరునకు మంచి మిత్రుడా రతిమనోహరభంగ: మన్మదుని భంగపరచినవాడ! శిష్టజనపాల: సజ్జలను రక్షించువాడ.

54. అ హరించి; మ్రింగి; నిర్జించు; చంపు

భావము; ఓ శ్రీముఖలింగవాస! ఈ విశ్వమును బూడిదిగా చేయగల హాలాహలమును మ్రింగి లోకములను రక్షించితివి. లోకకంటకులైన భయంకర త్రిపురాసురులను దునుమాడితివి మునులను బాధించు అంధకాసుర గజాసురలను చంపి ఋషిగణములను కాపాడితివి నీ భక్తుల కష్టమును దొలగించి వారి యాందోళన మాన్పుటకు నీవు తప్ప యితర దైవమేదియు లేదు.

టి5. ఓ శ్రీముఖలింగవాస! మాసములందు మాఘమాసము దానములలో అన్నదానము, స్త్రీలయందు పార్వతీదేవి, విద్యలలో ఆత్మవిద్య వ్రతములలో సత్యనాక్పాలన, మంత్రములలోని పంచాక్షరీ, ధర్మములలో అహింస కొండలలో మేరుపర్వతము సమస్త పూజలయందు నీయొక్క పూజ గొప్పదని సకలము తెలసిన పెద్దలు పలుకుచున్నారు.

టి6. ఈ పద్యము పరమేశ్వరుని మానసిక మృగపూజనేయు ప్రార్థనాపద్యము సచ్చిదానంద. సత్వగుణప్రధానుడవైన ఆనంద రూప; నిరీహ: కోరికలులేనివాడ ఋషిహృత్సరోరుహ భృంగ మునుల హృదయపద్మములలో తుమ్మెదవంటివాడ శతకోటి భాస్వంత; నూరుకోట్లసూర్యులకాంతితో వెలుగొందువాడ! భక్త పాలన కళా ప్రథితహృదయ; భక్తులను రక్షించుట అను కళయందు ఆరితేరినవాడ! హరిశరా: నారాయణుని అస్త్రముగా గలవాడ నిగమాశ్వ; వేదములు అశ్వములుగాగలవాడ త్రిపుర సంహార సమయమున యీశ్వరునకు నారాయణుడు అస్త్రము వేదములు రథమునకు గుఱ్ఱములు.

టి7 అహరహంబు: ప్రతినిత్యము; శరీరక రుజలు: శరీరసంబంధమైన వ్యాధులు

భావము: ఓ శ్రీముఖలింగవాస! నీ పూజను విడువక షట్కాలములు ఎవరు పూజింతురో వారికి ఎల్లప్పుడు ఆయురారోగ్యములు

కలుగును. శారీరక బాధలుపోయి చిత్తశుద్ధి యొనగూడును. దరిద్రముపోయి ధనయోగము గలుగును. ప్రతి విషయము నందును కళ్యాణములే కలుగుచుండును. ఈ భువిలో భోగ భాగ్యములు సమగూడి తనువు చాలించిన వెనుక శివలోక వాసమబ్బును ఇహపరముల రెంటియందును అట్టివారికి అడ్డము లేదు.

58. ఓ శ్రీముఖలింగవాస! నీ లీలలు నిత్యము పాడుకొని చర్చించ గలుగు అదృష్టవంతులు, శివయోగుల సేవలో ఎల్లప్పుడు తమ శరీరములను ధనమునువెచ్చించి తృప్తిజెందువారు, నీ భక్తులను పూజించి, వారిని సంతృప్తి పరచెడి పుణ్యవంతులు, సృష్టిలోని చరాచర జీవరాశులయందు నీ రూపమును దర్శింప గలుగు నియమపరులు, పరమ పూజనీయులు. భక్తుల హృదయమే నీ నివాసభవనము.

59. ఓ శ్రీముఖలింగవాస! నీ పావన పంచాక్షరీమంత్రము పఠించు వక్త్రమే వక్త్రము. పావనమైన విభూతిని ధరించు శరీరమే శరీరము. పావనమైన నీ పూజను నిత్యము సలుపు హస్తములే హస్తములు. నీ లీలను వినగలుగు చెవులే చెవులు. సృష్టి యందలి సర్వస్వమును నీ మూర్తియని భావించు జన్మమే జన్మము.

60. నీ కారుణ్యము, భక్తులకు దీర్ఘాయువును, శక్తిని, ప్రబలకీర్తిని యొసంగును. స్థిరసంపదలనిచ్చి సౌఖ్యము కలుగజేయును సంసారభయము. చావుపుట్టుకల భయము పాఱద్రోలి భక్తులను కాపాడును. చిత్తశుద్ధినొసంగి తాపత్రయములను పోగొట్టును నీ కారుణ్యమకరందం ఎవరికి లభించునో అట్టివారి భాగ్యమే భాగ్యము.

61. ఓ శ్రీముఖలింగవాస! కొండంత కాటుకను సముద్రమందు

కలపి సిరాగాజేసి కల్పవృక్షపు శాఖలను కలములుగా మలచి భూమిని కాగితముగాజేసి, సరస్వతీదేవియే స్వయముగా ఈ సృష్టియున్నంతకాలము వ్రాసినను మహానీయ కళ్యాణ గుణ సంపన్నుడవైన నీ అనంత గుణసంపదను వ్రాయుటకు అలవిగాదు. అట్టిది నావంటివాడు ఎట్లు నిన్ను పొగడగలడు మా కష్టములు మాన్చి కాపాడుము,

62. ఓ శ్రీముఖలింగవాస! బాలురు యిసుకలో గూళ్లు నిర్మించి రంగులు ముగ్గులుపెట్టి బొమ్మల పెండ్లిండ్లు గావించి కొంత సేపు వినోదింతురు, ఆట అయిపోయిన వెంటనే ఆ కట్టడముల నన్నింటిని పాడుచేసి పోవుదురు. అదే విధముగా ఈ సృష్టి యంతయు నీకు ఆట. సృష్టింతువు. పోషింతువు. మరలదానిని నాశనమొందితువు. సృష్టి యొకమాటు వెలికితెచ్చి మరలలోపలికి గొనిపోయి వినోదించు పరమాత్మ స్వరూప నీకువందనములు శైశవక్రీడ: చిన్నతనమందలిఆట, సైకతస్థలులు: యిసుకతిన్నెలు

63. అంబరము; ఆకాశము, పాషాణములు; రాళ్ళు, అబ్జాకరము; తామరకొలను, వాతాశనము: గాలిపీల్చిజీవించునది (ఆహారము గాగలది)

భావము:- ఓ శ్రీముఖలింగవాస! నిన్ను నిత్యము నిష్టతో అర్చించు వానికి యీభూమిపై అసాధ్యమనునదేలేదు సముద్రముపై కాలినడకను నడువ గలడు. ఆకాశమునందు పక్షివలె యెగుర గలడు. పాషాణములను బంతులవలె పట్టి యాడగలడు కనుదృష్టితో దేనినైనా కాల్చి వేయగలడు అగ్నిగుండమందు సరసులోవలె దిగగలడు ఎంతటివారినైనా మాటలతో ఆకట్టుకొనగలడు. పాముకోరలనైనను పెరుకగలడు

64. నిగమ సంచయము: వేదములు, భూతంబులైదు: పంచభూతములు, జైవాత్మక + అర్కులు: చంద్రుడును, సూర్యుడును,

ద్వాదశాదిత్యులు: సంద్రెండుమంది సూర్యులు, వర్ణప్రపంచము అక్షరముల సముదాయము. ( రంగురంగుల యీసృష్టి ) మనోబుద్ధ్యహంబు: మనస్సు, బుద్ధి, అహంకారము.

భావము:- ఓ శ్రీముఖలింగవాస! ఈ సృష్టియందలి సర్వమునకు నీవే కర్తవు, సృష్టి కారకుడైన బ్రహ్మ, స్థితి కారకుడైన విష్ణువు యీ అనంతవిశ్వము, వేదముల సముదయము నీవె. భూమి జలము, అగ్ని, ఆకాశము, వాయువులను పంచభూతములను చంద్రసూర్యులను నీవె, ఇంద్రాది దేవతావర్గము ద్వాదశాదిత్యులు, సమస్త విజ్ఞాన సముదయము నీవె; నారదాది సప్త ఋషులు, కాలచక్రము నీవె; మనసు, బుద్ధి, అహంకారములు నీవె; సర్వజీవులలో నిండియున్న యాత్మస్వరూపము నీవె.

65. అమరతటిని: గంగా(నదీ)దేవి; ఉడునాయకుడు: చంద్రుడు ఊర్ధ్వలోకములు: స్వర్గాదిపైలోకములు; మూర్ధము: శిరస్సు

భావము: ఓ శ్రీముఖలింగవాస! నీవు విశ్వమందంతట నిండియున్నావు ఆకాశము నీయొక్క జడలు, అందుగల గంగాదేవి నిర్మలత్వం చంద్రుడు శాంతము, స్వర్గాది పైలోకములన్నియు నీయొక్క శిరస్సు. చంద్రుడు, సూర్యుడు, అగ్ని నీకండ్లు. ఓంకారమే నీడమరుక నాదము సత్త్వ రజస్తమోగుణములు, వాటికి ప్రతినిధులైన త్రిమూర్తులు నీ శూలమందలి మూడుమొనలు నీ మాయాశక్తియే పార్వతీదేవి అట్టినిర్గుణ బ్రహ్మమైన నిన్ను ప్రార్థింతును.

66. ఓ శ్రీముఖలింగవాస! రజోగుణయుతుండవై యీ అందమైన చరాచర సృష్టినంతను నిర్మించి బ్రహ్మగా పేరుగాంచితివి. సత్వగుణయుతుండవై యీ సృష్టి సకలమును చల్లగా కాపాడి విష్ణుమూర్తివైనావు. తమోగుణ ప్రధానుడవై యీ సృష్టిని నీయందు లయమొనరించుచు రుద్రుడవైనావు. భూమి, గాలి

నీరు, అగ్ని, ఆకాశము అను అయిదు భూతములు చంద్రుడు సూర్యుడు, తత్పురుషుడు అను ముప్పురు మొత్తము ఎనిమిది మూర్తులుగా వెలుగొందు అష్టమూర్తివి నీవు. అనంత సూర్యులకాంతితో వెలుగొందు నీకుసాటి ఏవరునులేరు.

67. ఓ శ్రీముఖలింగవాస! ఎవరు యీ సృష్టిలోని జీవరాశులకు భూమిరూపమున వలసిన ఆహార పదార్థములనిచ్చి పోషించు చున్నారో; ఎవరు జలరూపమున సర్వజీవరాశికి జీవకారణమగు చున్నారో; ఎవరు ప్రళయకాలమున కాలాగ్నియై ఈ సృష్టిని దగ్ధము చేయుచున్నారో; వాయువై ఎవరు చరాచర సృష్టికి ప్రాణాధారమై, ఆకాశరూపమున పూర్ణుడై వ్యాపించుచున్నారో అట్టి పరబ్రహ్మమైన నిన్ను ప్రార్థన చేయుచున్నాను. అష్ట మూర్తివై కవచరూపమున మమ్ము కాపాడుము.

68. ఓ శ్రీముఖలింగవాస! పుట్టుట పెరుగుట నశించుట అను లక్షణములు గల్గి హానివృద్ధులుగల పామరుడను నేను నీవు ఆదిమధ్యాంతములు లేని సమస్త విశ్వము కుటుంబముగా గల విశ్వాత్మవు. కామక్రోధాది అరిషడ్వర్గములు సర్వభావ వికార ముతో ప్రతినిత్యము తేలియాడు అల్పుడనునేను. నీవు గుణ రహితుడవు. అనంత తేజోమయ మూర్తివి. ప్రధానపురుషుడవు అటువంటి నిన్న మావంటివారు వర్ణింపవశమా?

69. ఓ శ్రీముఖలింగవాస! శర్వుడను పేరనీవు. నీటివై జీవకారణ మగుచున్నావు. భవుడనుపేర భూమివై జీవరాసులను పోషించు చున్నావు. ఉగ్రుడనుపేర అగ్నివి మహాదేవుడనుపేర చంద్రుడవు భీముడనుపేర ఆకాశరూపుడవై సర్వవ్యాపి వైనావు. రుద్రుడను పేర గాలివి. పశుపతి అనుపేర యజ్ఞపురుషుడవు. ఈశానుడను పేర సూర్యుడవు. ఈ విధముగా నీవు విశ్వకర్తవై అష్టమూర్తిగా వెలుగుగొందుచున్నావు.

70. ఓ ఉమనాథ: ఓ ఈశ్వర; నిర్గుణ బ్రహ్మము: గుణములు ఆకారములేని శుద్ధసత్త్వము; వేదత్రయము: ఋగ్వేదము యజుర్వేదము, సామవేదము; విశ్వకర్తలు: బ్రహ్మ, విష్ణు మహేశ్వరులు; జాగ్రదాద్యవస్థలు: జాగ్రత్, స్వప్న, సుషుప్తులు విశ్వ, తైజస, ప్రాజ్ఞులు: జీవునియొక్క మూడు కారణ శరీర రూపములు; శరీరత్రయము: స్థూల, సూక్ష్మ, కారణశరీరములు ఓంకారమునందు: అఉమకారములు గలవు.

" ఓం మిత్యేకాక్షరం బ్రహ్మ " అను మహావాక్యమున కన్వమే యీ పద్యము ఓంకార రూపుడవైన నీకు నమస్కారము.

71. సృష్టియందలి సర్వమును నీవే. సూర్యుడు, చంద్రుడు, అగ్ని ఇంద్రాది దేవతలు బ్రహ్మ, విష్ణువు, ఏకాదశరుద్రులు, సిద్ధులు గంధర్వాది దేవగణములు, యముడు పంచభూతములు అన్నియునీవె అని వేదములు నిన్ను ప్రతిపాదించుచున్నవి. కాని నిన్ను తెలిసికొనగోరు సాధకునకు పరికించి చూచిన యెడల సృష్టియంతట నీవె. నిండియుందువు. నీవు కానిది యీ సృష్టిలో నేదియును లేదు.

72. ఓ శ్రీముఖలింగవాస! అష్టాంగయోగము నభ్యసించు మునీశ్వరులు మాత్రమే గాంచగలట్టి మూర్తినీది. విమలము, స్వచ్ఛము విజ్ఞానముతో గూడియున్నట్టిది. అపరిమితానందము కలుగు చేయునట్టిదై ప్రకాశించుమూర్తి నీది. సర్వశాస్త్రములు, వేద వేదాంగములందు ప్రతిపాదించబడినట్టి నిర్గుణబ్రహ్మ స్వరూప మైనది నీమూర్తి. శరీరమున ప్రత్యగాత్మగానుండి యోగ మహిమచే మాత్రమే దర్శింపగలుగునది నీమూర్తి. అనురక్తితో గాంచినవారికి నిర్మలము నిత్యము ఆనందదాయకము చిద్విలాసము కలిగించు పరమమైనది నీమూర్తి.

73. ఓ శ్రీముఖలింగవాస! ఈ జగమంతయు నీరూపమే. సర్వమును

తెలిసినవాడవు. నీయంత నీవుగా ప్రకాశించువాడవు. నిర్మల మూర్తివి. వేదములు నీ ఉచ్ఛ్వాస నిశ్వాసములు. అవతార రూపమున నీవు సగుణుడవు. పరబ్రహ్మరూపమున నీవు నిర్గుణుడవు. నీవాక్కులు అమృతమయమై మిక్కిలి మధురము లైనవి. బ్రహ్మాది దేవతలును యత్నించి నిన్ను పొగడశక్యము గాదు. నీమూర్తిని వర్ణించలేదు. నిన్ను వర్ణించుటచే నావాక్కులు పావనములగునని నీవర్ణన గావించుచున్నాను.

74. ఓ శ్రీముఖలింగవాస! క్రైస్తవులకు నీవు యేసు క్రీస్తువు. ముస్లిము సోదరులకు నీవు అల్లావు. బౌద్ధులకు, జైనులకు నీవు గుణరహితుడవైన మూర్తివి. హిందువులకు శివుడుగా రామునిగా, కృష్ణునిగా అలరియున్నావు. ఎవ్వరేపేర నిన్ను పిల్చిన ఎవరేమతము అనుసరించిన నీమూర్తి యొక్కటే,

75. ఓ శ్రీముఖలింగవాస! పంచవక్త్రుడవై మమ్ముకవచమై యెల్ల వేళకాపాడుము. మెరుపుల గుంపువలె పరుశవును ధరించి తత్పురుషమూర్తివై తూర్పుదిశయందు పుఱ్ఱెదండలు ఢమరుక ధరించి అఘోరుండవై దక్షిణదిశయందు, సద్యోజాతుడవైన నీవు సదాశివునిగా పశ్చిమ దిశయందు, నాల్గు ముఖములతో వామదేవనామమున ఉత్తరదిశయందు, యుగ్రమూర్తివైఈశాను డనుపేర ఊర్ధ్వమునను నెలకొని మమ్ముకాపాడుచున్నావు,

76. ఓ శ్రీముఖలింగవాస! నీ పంచాక్షరీమంత్రము శ్రీమంతమైనది సకల శుభములను గూర్చునది. పాపమనెడి కొండలను గూల్చు వజ్రాయుధము వంటిది. బ్రహ్మాది దేవతలకు నిత్యము జపియింపదగినదై పరతత్త్వబోధకమగునది. కాశీరాజ పుత్రి పంచాక్షరీ మంత్రమహిమచే భర్తపాపములను పాఱద్రోల గలిగినది. ఓ కృత్తివాస నీ పంచాక్షరీ మంత్రము జపించిన దుర్భరమైన సంసారభయము తొలగిపోవును.

## కాశీరాజ కుమార్తె గాథ :-

భరతఖండమున గల పుణ్యక్షేత్రములన్నిటి యందును కాశీనగరము మిక్కిలి పుణ్యవంతమైనది. మోక్షప్రదమైనది. ఆ నగరమును పాలించురాజు పరమ శివభక్తి పరాయణుడు. ప్రజారంజకముగా పాలించు చుండెను. అతనికి సంతానము లేదు. మిక్కిలి నిష్ఠతో భార్యాసహితుడై పరమేశ్వరుని పూజించి దానధర్మములు గావించెను. ఈశ్వరుని వర ప్రభావమున ఆ దంపతులకు ఒక పుత్రిక జన్మించెను. ఆమెకు కళావతి అను పేరిడిరి. అమె దినదిన ప్రవర్ధమానమగు చున్నది· యౌవనవతి యైనది. వారింటికొకనాడు దూర్వాస మహాముని వచ్చెను.

వచ్చిన దూర్వాస మహామునికి కాశీరాజు సకల విధ్యుక్త పూజలు గావించెను. తనయింటకొన్ని దినములుండుమని ప్రార్ధించెను. దుర్వాసుని పరిచర్యలకై తన పుత్రికయైన కళావతిని నియోగించెను. ఆమె మిక్కిలి వివేకముతో ముని మెప్పుపడయునట్లు సపర్యలు గావించెను దూర్వాస మహాముని ఆమె యుపచారములకు మిక్కిలి సంతసిల్లెను. అమెకు శివపంచాక్షరీ మంత్రముపదేశించెను.

ఆ పంచాక్షరీ మంత్రజపముచే కళావతి పాపరహితయై మిక్కిలి నిర్మలయైనది. సదాచారముతో దినములు గడపినది. తండ్రి అమెకు వివాహ ప్రయత్నములు చేసెను. యదువంశరాజు, మధురానగర పాలకుడైన దాశార్హునకిచ్చి వివాహము గావించెను. వారి మొదటి రాత్రి దాశార్హుడు ఆమెను అనుభవింపగోరెను. కళావతి తను పంచాక్షరీ మంత్ర దీక్షావ్రతమునందునున్నానని తనను అంటరాదని భర్తకు చెప్పెను. ఆమె మాటలను వినక ఆమెను బలాత్కరింపబోయెను. ఆమె శరీరము కాలిన యినుప గుండువలెనుండెను. ఆ రాజు ఆశ్చర్యమునుబొంది ఆమెను కారణమడిగెను. అది పంచాక్షరీ మంత్రప్రభావమని అమె వానికి చెప్పి దూర్వాస మహాముని తనకు ఉపదేశము చేసిన విధము తెలిపినది. అమె మరియు తన భర్తను సదాచారుడవను కమ్మని కోరెను. సద్గురువుల సేవ

చేయవలెనని అతనికి చెప్పెను అంతట దాశార్హుడు పంచాక్షరీ మంత్రము యుపదేశింపుమని భార్యను కోరెను. భర్తకు భార్య మంత్రోపదేశము చేయరాదని చెప్పి, వానిని గర్గమహాముని యొద్దకు తీసుకొనిపోయెను. వారి కులగురువైన గర్గమహాముని వారి ప్రార్థిన మన్నించి, రాజును యమునానది యొడ్డునకు తీసుకొనిపోయి, అతని తలపై చేయివిడి పంచాక్షరీ మంత్రముపదేశించెను. దాశార్హభూపతి ఆ మంత్రము నిష్టతో జపించెను. శతకోటి సంఖ్యగల కాకులు రెక్కలు విరిగి యమునా నదిలో పడిపోయెను. అంతట దాశార్హభూపతి ఆశ్చర్యముతో, గర్గమహామునికి సమస్కరించి ఈ కాకులేమి? ఎందుకిట్లు రెక్కలు విరిగి పడినవని అడిగెను. అంత గర్గమహాముని ఓరాజా! నీవు జన్మజన్మలనుండి చేసిన పాపములు ఈ మంత్రప్రభావముచే కాకుల రూపమున రెక్కలు విరిగి యమున యందుపడినవి, నీవు పాపరహితుడవైనావు అని చెప్పెను. ఈ విధముగా కాశీరాజ కుమారై భర్తను మహిమపరచెను.

77. ఖండేందుధరుడు : శిరసున చంద్రరేఖను ధరించినవాడు పాపమెడపె: పాపములు పోగొట్టెను; దురితహరము: పాపములు హరించునది.

## కల్మాషపాదుని కథ :-

కళ్యాణప్రదమైన సాకేతపురమును మిత్రసంహుడను రాజు పాలించుచుండెను. రాముని వంశమైన కాకుత్స్థవంశమునకు చెందినవాడు మిత్రసంహుడు. ప్రజల యుపయోగార్థమై అనేకములైన మంచినీటి బావులను, చెరువులను, వ్యవసాయ యోగ్యమైన నీటిపారుదల సౌకర్యములను గావించి ఆరాజు ప్రజారంజకముగా పాలించెను. దేవబ్రాహ్మణ భక్తిసంపన్నుడై దేవాలయములను నిర్మించి అనేక యజ్ఞయాగాదుల చేసి మిక్కిలి కీర్తినందెను.

ఒకనాడా రాజు మునుల తపస్సులను పరిరక్షించుటకై

అరణ్యమునకు వేటకై వనచరులను గూడివెడలెను. అనేక క్రూరమృగములను వేటాడెను. అతనికి యొక భయంకర రాక్షసుడెదురయ్యెను. ఆ రాక్షసుని యొకవాడియైన బాణమున రాజు వధించెను. ఆ రాక్షసుని సోదరుడు రాజుపై పగబట్టెను. సేవకుని వేషమున రాజు కొలువునందు చేరెను. వానిని రాజు వంటవానిగా నియమించెను. రాజుయింట యొక నాడు పితృకార్యము జరిగినది. కులగురువైన వశిష్ఠుని భోక్తగా రాజు పిలచెను. దుష్టబుద్ధియైన వంటవాని రూపముననున్న రాక్షసుడు భోజనమునందు వశిష్ఠునకు నరమాంసము వండిపెట్టెను. పాపము మిత్రసంహునకు ఈ విషయము తెలియదు. నరమాంసమని దివ్యదృష్టిని గమనించిన వశిష్ఠుడు రాజైన మిత్రసంహుని నిరపరాధియని యెంచక "రాక్షసుడవు గమ్మ"ని శపించెను. మిత్రసంహుడు గూడ శాపమీయ సమర్థుడే అతడు వశిష్ఠుని శపించుటకు శాపజలములను చేతియందు గ్రహించెను. కాని వాని భార్య వశిష్ఠుని శపించుట తగదని భర్తను వారించెను. అంతట రాజు తను గ్రహించిన శాపజలములనేమి చేయవలెనని భార్య అడిగెను. వాటిని పారలోసిన ఆ ప్రదేశమును దహించును. ఆ రాజు భార్య ఆ శాపజలములను రాజు పాదములపై జల్లుకొనమనెను. ఆ రాజు శాపజలములను తన పాదములపై చల్లుకొనెను. ఆ రాజు పాదములు కమిలిపోయెను. అందుచేతనే అతను కల్మాషపాదుడయ్యెను.

రాజు నిరపరాధి అని తెలుసుకొనిన వశిష్ఠుడు 12 సంవత్సరముల తరువాత రాక్షస రూపముపోయి నిజరూపము వచ్చునట్లును గ్రహించెను. కల్మాషపాదుడు శాప ప్రభావముచే నిజరాజ్యమునకు దూరుడై క్రూరకర్మలనుజేయుచు పశుపక్ష్యాదుల చంపి తినుచు రాక్షస రూపమున అరణ్యమున సంచరించుచుండెను. ఒక దినమున అతడు ఒక బ్రాహ్మణ జంటనుగాంచెను. ఆకలికి తట్టుకోలేక అందు భర్తను చంపి తినెను. ఆ బ్రాహ్మణుని భార్య దుఃఖించి రాక్షస రూపమునయున్న రాజును, భార్యపొందుగోరి అంటిన మరణింతువని శపించెను. అంతట ఆ బ్రాహ్మణి భర్త వియోగముతో అగ్నిప్రవేశము గావించి ప్రాణ

పరిత్యాగము కావించుకొనెను.

12 సంవత్సరముల తరువాత రాజునకు రాక్షస రూపము పోయి నిజరూపము వచ్చెను. రాజ్యపాలన వశిష్టుని అనుమతిని చేపట్టెను కాని బ్రాహ్మణకాంత శాపప్రభావముచే భార్యను మాత్రము పొంధలేక పోయెను. వశిష్టుని అనుగ్రహముచే నారాజు భార్యకు అశ్మకుడను కొడుకు జన్మించెను. రాజు విరక్తిజెంది స్త్రీ భోగములేవి రాజభోగములేలయని దేశాటనమునకు బయలుదేరెను. అతను గావించిన బ్రాహ్మణ హత్యా పాతకము పిశాచరూపము అతని వెన్నాడుచుండెను. అ పిశాచము రాజునకు తప్ప అన్యులకు కానరాదు.

ఒక దినమున రాజునకు గౌతమ మహాముని దర్శనము లభించెను. అంతటరాజు గౌతమ మహామునికి బ్రాహ్మహత్యా పిశాచమును మొదిలించుకొను మార్గము సెలవీయవలసినదిగా కోరెను. అనేక యజ్ఞ యాగములు, దానధర్మములు గావించితిని. తీర్థయాత్రలు సేవించితిని గాని యీ బ్రాహ్మహత్యా పిశాచమును శాపము నుండి నాకు విముక్తి లభించ లేదని మొరపెట్టుకొనెను. ఈ పిశాచమును నాదృష్టిపథమునుండి తొలగు మార్గముపదేశింపుడని ప్రాధేయపడెను.

అంతట రాజునకు గౌతమ మహాముని గోకర్ణక్షేత్ర మహాత్మ్యమును వివరించెను. గోకర్ణక్షేత్రమునుదర్శించి అచట తీర్థమాడు వారికి మోక్షము సిద్ధించును. పాపములను దహించు అగ్నిఅది బంగారం దొంగిలించు పాపము, బ్రహ్మహత్యా దోషము. వర్ణాచారములను విసర్జించు పాపం, గురుభార్యాసక్తి, చాడీలు చెప్పుదోషం, అహంకారమును కలిగియుండు దోషం, చేసినమేలు మరచి పోవుట అన్నదోషం, గోకర్ణ క్షేత్రమును దర్శించినంతనే తొలగిపోవును. రావణ కుంభకర్ణాది రాక్షసులు, భగీరథాది రాజన్యులు, యక్ష కిన్నెర కింపురుషాది, దేవగణములు యిచట తపమాచరించిరి కోరిన వరములనంది అనేకలింగములను ప్రతిష్ఠించిరి మాఘమాస కృష్ణపక్ష చతుర్థశి అనగా శివరాత్రి దినమున యిచట గోకర్ణేశ్వరుని దర్శనము బిల్వపత్ర, తీర్థ ప్రసాదములు,

లభించిన వారికి మోక్షము కరతలామలకము, గాన నీవు గోకర్ణమును దర్శించిన యెడల నీ బ్రహ్మహత్యాపాతకము నశించి నీవు శాపవిముక్తుడ వౌదువని గౌతముడు రాజునకెరిగించెను.

అంతట కల్మాషపాదుడు గౌతముని యాజ్ఞ శిరసావహించి గోకర్ణమునకు వెడలెను. గోకర్ణేశ్వరుని దర్శించి తీర్థప్రసాదములను గొని బ్రహ్మహత్యా మహాపాతకము నుండి విముక్తుడై, రాజ్యమునకు వచ్చి భార్యతో సుఖించి, జనరంజకముగా పాలించి, జన్మాంతరమున అఖండ శివలోకవాసమును పొందెను. (బ్రహ్మోత్తర ఖండము నుండి)

## గోకర్ణమున ముక్తినందిన చండాలికథ :-

గోకర్ణస్థల మహాత్మ్యమును తెలియజెప్పుచూ గౌతమడీకథను కల్మాషపాదునకు తెలిపెను.

గోకర్ణ తీర్థమున మహాదేవుని యుత్సవము చూచుటకు శివ రాత్రినాటికి సకల దేశముల నుండి ప్రజలసంఖ్యాకముగ వత్తురు. శాండిల్యుడు అత్రి, మరీచి, వశిష్ఠ, వ్యాస, కాత్యాయన, మాండవ్య అసిత, కణ్వ, కాకుత్స, శుకరామ, అగస్త్య, దూర్వాస, గౌతమ మునులు విశ్వామిత్ర, మైత్రేయ మార్కండాది ఋషులు ఆనాటికి అచటికి వచ్చిరి.

ఈ మునులందరును మధ్యాహ్నసమయ కృత్యములనుదీర్చి యొక విశాలమైన వృక్షము యొక్క నీడలో విశ్రమించిరి. వచ్చిపోయెడి జనసందోహమును గమనించుచుండిరి. ఇంతలోనొక గ్రుడ్డిది, మొలచుట్టు మాత్రమే బట్టగలది, మలమూత్రములతో నిండి దుర్గంధ పూరితమైన శరీరము గలది, పురుగులు కారుచున్న వ్రణములు గలది, కుష్ఠువ్యాధి పీడిత, వికృతాకారముగలది, ఆకలితో బాధపడుచున్న యొక చండాలి వచ్చెను. బంధుమిత్రులచే విడువబడితిని, కూడగుడ్డలేని కులహీనురాలను దిక్కులేనిదానను, యీశ్వరారాధన యెరుగని దానను, ఆకలితాళ లేకున్నాను. అని దీనాతిదీనముగా యేడ్చుచున్నది

సాయంకాలమున శివార్చన పూర్తికానిదే యెవరునుహారము పెట్టరు, ముట్టరు. కాని యొక తంటరి భిక్షయని ఆ గ్రుడ్డిదాని చేతి యందు బిల్వపత్రదళాన్ని పడవేసెను. తినుటకు యుపయోగింపని ఆ ఆకులను ఆమె విసరివేయగా అచ్చట లింగాకారమునయున్న యొక రాయిపైబడెను. అంతనాచండాలి యుత్తర దిక్కునయున్న కాళికాలయము వైపునకుపోయి ఆకలికితట్టుకొనలేక శోషవచ్చి నేలబడి ప్రాణములు విడచెను.

అంత శివశంకరులు ఆమె ఆత్మనుగొనిపోవ దివ్యవిమానమును గొనివచ్చిరి. కుక్కకు యాగభాగమనునటుల ఆ చండాలికి దివ్యవిమానము శివలోక ప్రాప్తికి అర్హతగలదా? యని అచట మునులకు అనుమానము గలిగినది. అందు గౌతమముని ఆ శివశంకరులను నిలదీసి ప్రశ్నించెను.

ఆ శివశంకరులు ఆ చండాలి గాధను మునులకు ఈ విధముగా తెలియజేసిరి,

వేదవేదాంగాది పరుడు యజ్ఞయాగాది ప్రవర్తకుడైన యొక బ్రాహ్మణుడు గలడు. వానికి రూపవతి యను పేరుగల కుమార్తె గలదు. పేరునకు తగ్గట్టు ఆమె అతిలోక సౌందర్యవతి. యుక్త వయసురాగానే ఆమెకు తండ్రి వేదోక్తముగా వివాహము గావించెను. కాని దాని పూర్వ జన్మ కర్మానుసారముగ ఆమె భర్త అనతికాలములోనే మరణించెను. ఆమె యౌవ్వనవతి, భర్త గతించెను. ఆమెకు మారుమనువు లేదు. ఆమె కోరికలను అణచుకోలేక సిగ్గువిడచి విచ్చలవిడిగా పరపురుషులను గూడి నిరంతరము కామాతురయైన సంచరింపదొడగెను. ఆమెను కులమువారు వెలివేసిరి. అంత నామెధనవంతుడైన యొక శూద్రునితో లేచిపోయెను. వాని తోడిదేలోకమై మద్యపానము మాంసభక్షణము గావించెను.

ఆమె యొకరాత్రి తాగినమైకములో మేక మాంసమును తినవలెననికోరి, చేత కత్తిబూని, మేకలుగల శాలలోనికి పోయెను. ఆ చీకటిలో మేక యనుకొని యొక ఆవుదూడను చంపివేసెను. విషయము

తెలసిన తన్ను శిక్షించెదరను భయముచే ఆదూడను సగముతిని పులివచ్చి భక్షించెనని అందరిని నమ్మబలికెను. అందరును నిజమనుకొనిరి

కొంత కాలమునకు ఆమె చనిపోయెను. నరకమునకు వెడలెను యముడు ఆమెను కత్తిదారులపై నడిపించెను. శూలము గ్రుచ్చించెను వైతరణిలో బడవేసెను. సలసల క్రాగుచున్న నూనెలో బడవేసెను. అనేకమైన ఘోర రౌరవాది నరకములకు గురిచేసెను, ఇంకను ఆమె కర్మ పరిపక్వము గాలేదు మరుజన్మమున ఆమెయొక చండాలిగా జన్మించెను ఆమె తొలుత వర్ణించిన ప్రకారము రోగగ్రస్తయై మిక్కిలి హేయముగా బ్రతుకజొచ్చెను,ఇప్పుడీవిధంగా బిల్వదళము ప్రాప్తించుటచే ముక్తినందినది అంత గౌతముడు ఆమె యే పాపములచే ఈ బాధలను అనుభవించినది? ఆమెకెట్లు ముక్తి లభించినదని శివకింకరులనడిగెను

అంత వారు ఆ గౌతమున కిట్లనిరి ఎన్నడును అన్నదానము చేయని కారణముచే ఆకటితో అలమటించినది, కామాంధురాలగుటచే పుట్టుగ్రుడ్డియైనది. ఆవుదూడ మాంసము దినుటచే చండాలజన్మము గలిగినది. యదేచ్ఛగా దిరుగుటచే దౌర్భాగ్యురాలైనది. విధవయై జారిణి యగుటచే కుష్ఠురోగపీడితయైనది.

అమె గోకర్ణమునందు శుభప్రదమైన మాఘమాస కృష్ణ చతుర్థశి పుణ్యదినమున (శివరాత్రి) అన్నము లభింపని కారణముచేతనైనా యుపవాసమున్నది. బిల్వదళమును లింగాకారరాతి యందు యుద్ధేశ పూర్వకముగా కాకపోయినను వేయుటచే బిల్వదళ అర్చన పుణ్యము లభించినది, ఈ రెండు కారణములచే ఆమె జన్మాంతర దోషములన్నియు నిశ్శేషముగా నశించినవి పుణ్యక్షేత్రమైన గోకర్ణమున పుణ్య దినమందు ప్రాణములు విడచుటచే శివలోకప్రాప్తి కలిగినది. మోక్షము లభించినది. (బ్రహ్మోత్తరఖండమునుండి)

# శునకము రాజైన కథ

దాశరాజు అనేక జన్మల జ్ఞానము కలిగియుండుకథ

సూతుడు శౌనకాది మహామునులకు ఈ కథ చెప్పెను

శుక్ల, కృష్ణ,పక్ష చతుర్దశులయందు సదాశివునకు దీపమాలికలు అర్పించువారు సార్వభౌములగుదురు మంచి జ్ఞానవంతులగుదురు. దీనికొరక ఇతిహాసము కలదు.

తొల్లి నిషాద దేశము గలదు, ఆ దేశ ప్రజలందరూ ఆనంద దాయకమైన జీవనము గడుపుచుండిరి. ఆదేశమునకు రాజు దాశరాజు, ఆయన భార్య కుముద్వతి. అతడు భోజన ప్రియుడు, శిష్టాచార విహీనుడు కామ పీడితుడు. కాని యెన్నియో శివాలయములు నిర్మించెను. సహస్ర ఘటాభిషేకములు చేయించెను, దీపమాలికలను వెలిగించెను. నిత్యము మహాదేవుని బిల్వదళములతో నర్చించెను.

అతని ప్రవర్తనతీరునకు. ఆతని ఈశ్వరభక్తికి పొత్తుకుదుర లేదు. అందుచేత అతనిభార్యభర్తను యీ విషయమే ప్రశ్నించెను. అతను భార్యానురక్తుడు గావున ఆమెతో తనకథను చెప్పెను,

ఈ రాజు పూర్వజన్మము కుక్కజన్మము. ఆ కుక్క పంపా నగరమున సంచరించు చుండెడిది. ప్రతి దినము తన ఆకలి దీర్చుకొను టకు యిల్లుయిల్లు తిరుగుచు వారితిని పారవేయు దానిని తినుచు కొన్ని సంవత్సరములు గడపినది. ఒక శివరాత్రి సమయమున ఆ నగర పౌరులందరును ఆశ్రితరక్షకుడైన విరూపాక్ష దేవాలయమునకు వెడలిరి పంచామృతములతో దేవదేవుని అభిషేకించి దీపమాలికలు వెలిగించిరి సకల దిక్కుల నుండియు భక్తులు తండోప తండములుగా ఆదినము ఆలయమునకు వచ్చిరి. వారందరు వెలిగించిన దీపములతో ఆ గుడి నక్షత్రమండలమువలె ప్రకాశించెను. ఈ కుక్కకూడ గుడివద్దకు పోయెను వారు నివేదించిననైవేద్యములను భక్షింపవలెనని కుక్కకు కోరిక గలిగెను కాని వారు ఆకుక్కను అదలించి పంపివేసిరి. అయినను మరల పోయి

ఆ కుక్క మిక్కిలి ప్రీతితో అచటి నైవేద్యములను దీపమాలికలను చూచుచూ నిలబడెను. అచటజరుగుచున్న శివసహస్రనామస్తవము వినెను వేదపఠనమాలకించెను. అంత పురోహితుడు ఆకుక్కను కర్రతో అదలించి తోలెను. ఆ చోటు విడచి కుక్కపోయెను. కాని ప్రసాదములు తినవలెనని కోరికతో మరల మరల పోయెను. అంతట ఆకతాయిలైన కొందరు పిల్లలు దయలేక ఆ కుక్కను రాళ్ళతో మోదిరి. కుక్క పారిపోయెను. కాని మరల చేరెను. అంత విల్లంబులు ధరించిన యొకడు ఆ కుక్కను బాణముతో కొట్టెను. శివసన్నిధానమున ఆ పుణ్యదినమందు అది ప్రాణములు విడచినది.

పరమేశ్వరుని సన్నిధిని మాఘకృష్ణ చతుర్దశియగు శివరాత్రి పుణ్యదినమున యుపవాసముతో దీపమాలికలు దర్శించుటచేత మరణానంతరము హీనమైన శునకజన్మవిడచి దివ్యదేహము దాల్చి కొంతకాలము స్వర్గసుఖములనుభవించినది ఆ కుక్క. తరువాత ఈ నిషధదేశమునకు రాజుగా జన్మించినది. శివుని దీపమాలికలు దర్శనముచే ఆ కుక్కకు పూర్వజన్మస్మృతి కలిగియున్నది. అంతియేకాక మరి యేడుజన్మల వరకు అది పూర్వజన్మస్మృతి కలిగియున్నది. (బ్రహ్మోత్తరఖండమునుండి)

## 78. గోపాలబాలుడు ;

## చంద్రసేన మహారాజుల కథలు ;-

ఉజ్జయినీపురము రాజధానిగా చంద్రసేనుడు రాజ్యపాలనము చేయుచుండెను. అతని పాలనలో ప్రజలు యీతిబాధలులేక సుఖసంతోషములతోనుండిరి. చంద్రసేనుడు నిరంతరము అతిథి అభ్యాగతులను పూజించి దానధర్మాదికార్యములు చేయుచుండెడివాడు. ఒక దినమున మణిభద్రుడను యోగిపుంగవుడు రాజును చూచుటకు వచ్చెను. అతని ఔదార్యాది గుణములనుగాంచి ఆ యోగి సంతసించి "చింతామణి" యను మహిమ గల మణిని చంద్రసేన మహారాజునకు ప్రసాదించెను. శివపారిషదుడైన ఆ మణిభద్రుడు చింతామణి మహాత్మ్యమును రాజునకు

తెలియజేసెను. " ఓ రాజా! దీనిని యల్లప్పుడును నీవు ధరింపుము. ఇది మిక్కిలి శుభదాయకమైనది. మిక్కిలి శ్రేష్ఠమైనది " అని జెప్పెను.

ఆ మణిని కంఠమున ధరించిన చంద్రసేనుడు, కౌస్తుభము నుదాల్చిన శ్రీమన్నారాయణునివలె వెలుగొందెను. భాస్వంత తేజస్వియైన ఆ రాజునుగాంచి అతని శత్రువులోర్వలేక, అతని సామ్రాజ్యమును హరింపవలెనని తలపోసిరి. సౌరాష్ట్ర, కళింగ, అంగ, వంగ, కురు పాంచాల, కొంకణ, ఆంధ్ర, గాంధార, సౌవీర, అవంతిక, కరూశ, కేకయ శక, అభీర, టింకణ. మాళవ దేశపు రాజులందరూ యొకటిగాజేరి ఆరాజుపై దండయాత్ర గావించిరి. అతని భోగభాగ్యములు శివప్రసాదమని తెలుసుకొనలేక పోయిరి.

వారందరను యజ్జయినీ పురప్రాంతమున సేనలను మోహరింపిరి. ఈ వృత్తాంతము విన్న చంద్రసేన మహారాజు మిక్కిలి భయముందెను. తన సేనలను యోధులను నగర మొగదలనుండ నియమించి చంద్రసేనుడు శివధ్యానమునకుపక్రమించెను.

బ్రహ్మ సారధిగా, మేరుపు విల్లుగా, భూమి రధముగా సూర్యచంద్రులు రథచక్రములుగా, వేదములు అశ్వములుగా, నారాయణుండు శరముగా, శేషుండు నారిగా నాడు త్రిపురాసులను గాల్చిన పరమేశ్వరుని ధ్యానింప మొదలిడెను. ఈశ్వరాలయమునకు పోయి అభిషేకములు గావించి మారేడు దళములతో పరమేశ్వరుని అర్చించ మొదలిడెను.

మంత్రి పురోహిత పౌరజనములతో నారాజు శివపూజ గావించుచుండగా, ఆ వేడుకను గాంచుటకై అయిదు సంవత్సరముల బాలునెత్తుకొని యొక యాదవకాంతవచ్చి పూజను తిలకించి యీశ్వరునకు నమస్కరించి వెడలిపోయెను. ఆరాజు గావించిన శివపూజను గాంచిన అయిదేండ్ల గోపబాలుడు పులకించిపోయెను. వారియింట ముంగిట గల యిసుకలో తాను ఒక లింగాకారమును కల్పించుకొని ఆ లింగమునకు

షోడశోపచార పూజలు గావించెను. అన్నపానాదులను సహితము మరచి తదేక శివధ్యానరతుడై ఆ గోపబాలుడు బాహ్యస్మృతి లేక సమాధి నిష్ఠుడైయుండెను. కొంత సేపటికి వానితల్లి బాలుని వెదుకుకొనుచు వచ్చి వానిని భోజనమునకు రమ్మని పిలిచెను. కాని సమాధి నిష్ఠుడైన బాలుడు మునివలె కదలక మెదలక యుండెను. వాని తల్లి కోపించి అదియాట అనుకొని కొట్టెను. కాని బాహ్యస్మృతి లేని ఆ గోపాలుడు కదలలేదు. పలుకలేదు. వాని తల్లికి కోపమువచ్చి వాని పూజను భగ్నము చేసి వాడు ప్రతిష్ఠించిన ఇసుక లింగమును యూడపెరికెను.

అంతకొంత తడవునకు యా బాలుడు కన్నులుదెరచి చూచి తన పూజ భగ్నమగుటకు మిక్కిలి రోదించెను. ఇది అంతయు తన తల్లి చేసినదని తెలుసుకొనెను. తన తల్లిని క్షమించుమని పరమేశ్వరుని వేడెను. మా తల్లి అజ్ఞానమునకు క్షమింపుమని ప్రార్థించుచూ రోదించుచూ నేలపై బడి మూర్ఛపోయెను. వాడు మూర్ఛదేరి చూడగా మిక్కిలి చోద్యముగా వానిముందు మనోహరమైన రత్నకాంచన మయమైన శివాలయము కనుదురుకొనెను. వాడు మహదానందముతో ఆ మహేశ్వరుని వివిధ నామములతో ధ్యానించెను. ఈ విషయము తన తల్లికి తెలియజేయుటకై తన యింటికి వెళ్ళెను. వాని యిల్లు సకల భోగభాగ్యములతో నిండియుండెను. అతని తల్లి మహదానందభరితురాలై ఆ శివాలయమును దర్శించుటకు వెళ్ళెను.

ఈవార్త వినిన చంద్రసేన మహారాజు ఆ ఆలయమునకు వచ్చి బంగారు పానవట్టము పైనున్న పరమేశ్వరుని దివ్యలింగమును గాంచెను. ఆ మరుచటి దినమున ఆ మహాదేవుని దివ్యలీలచే అతని శత్రు రాజులందరూ మిత్రులుగా మారివచ్చి అతనితో సంధిగావించుకొని బాలుని భక్తిచే నెలకొన్న పరమేశ్వరు దివ్యలింగమును దర్శించిరి, ఆ గోపబాలుని భక్తిప్రమత్తులను ప్రశంసించిరి శివభక్తి ప్రేరితులై వారివారి రాజ్యములకు వెడలిపోయిరి.

79. భూరిత్తము: అధికమైన ధనము; ఉడుపుట : నివారించుట

## విప్ర, రాజ, కుమారుల కథ :-

విదర్భదేశమును సత్యరథుడను రాజు పాలించెను. శత్రు రాజులందరు యేకమై అతనిపై దండెత్తిరి. యుద్ధములో సత్యరథుడు మరణించెను. శత్రురాజులు నగరమునాక్రమించిరి. నాటికి సత్యరథుని భార్య గర్భవతి. భర్త మరణమువిని ఆమె భయపడి అంతఃపురము వీడి పారిపోయెను. ఆ పోవుటలో సరియైన మార్గము తెలియక అరణ్యము లోనికి వెడలెను. ఆ అరణ్య మధ్యమున ఆమె సర్వ లక్షణలక్షితుడైన మగశిశువును కనెను, ఆ శిశువునెత్తుకొని మరల ప్రయాణము సాగించెను. ఆమె యొక సరస్సునొద్దకు వచ్చెను. దాహము మిక్కుటముగానుండుటచే ఆ మగశిశువును సరస్సు గట్టుపైనిడి సరస్సులోనికి దిగెను. దురదృష్ట వశమున ఆ సరస్సులోనున్న యొక మొసలి యామెను మ్రింగివైచెను.

ఉదయ భాస్కరునివలె ప్రకాశించుచున్న ఆ బాలుడు తల్లి దండ్రులులేని యనాథ అయ్యెను. గట్టుపైనున్న బాలుడు హృదయ విదారకముగా ఆక్రందనము చేయుచుండెను. ఆ మార్గమునందు భిక్షుకి అయిన యొక బ్రాహ్మణకాంత పోవుచుండెను. ఆమెకు యొక సంవత్సరము వయసుగల బాలుడుండెను. దైవఘటనచే యీరాచ బిడ్డడు ఆమె కంట బడెను. నిరాధారుడై యేడ్చుచున్న ఆ పసికందును యీ బ్రాహ్మణకాంత తీసుకొని వచ్చెను. తన కుమారునితో సమానముగా వానిని సాకజొచ్చెను తన కుమారునితో సమానముగా వీనికిని యుపనయనము గావించెను. ఆ బాలురిద్దరును అనుదినము బిక్షాటనకు పోవుచుండెడివారు విధివైపరీత్యము రాజు గర్భమున జన్మించి, బ్రాహ్మణకాంత పోషణలో పెరిగి బిక్షాటనము ఆ బిడ్డడు చేయవలసి వచ్చెను.

ఆ విప్రవనిత యీ యార్భకులతో భిక్షాటనము సేయుచు యామె యొక దినమున యొక యూరిలోగల శివాలయమునకు వెళ్ళెను. అచట శివమహోత్సవము జరుగుచుండెను. ఆ విప్రకాంత ఆ బాలునితో యాయుత్సవమును తిలకించుచుండెను. విధిప్రేరణమువలనగా నిదియే.

ఆ యుత్సవములను నిర్వహించు చున్నవారిలో శాండిల్య మహాముని యుండెను. ఆ మహానుభావుడు యీ బాలకుని పరికించిచూచెను. మిక్కిలి ఆశ్చర్యముగా నిట్లు చెప్పెను. " కర్మ పరిపాకమునెవ్వరు దప్పించలేరు రాజ కుమారుడు యీ బాలుడు బ్రాహ్మణకాంతయే తన తల్లి యనుకొని యామెతో భిక్షాటనము సేయుచుండెను. " అని చెప్పగానే వాస్తవము తెలియని యా బ్రాహ్మణకాంత యీ వివరములు దెల్పుమని శాండిల్య మహామునిని ప్రార్థించెను. అంత శాండిల్యుడు ఆ విప్రకాంతకు సత్యరథ మహారాజు కథ జెప్పెను. అంతనామె " అయ్యా యే కారణముచే యీతని తండ్రి యుద్ధరంగమున మరణించెను? ఈతని తల్లిని మొసలి యేల మ్రింగివేసెను? యే కారణముచే యీ రాచబిడ్డకు భిక్షాటనము ప్రాప్తించినది? దయతో నాకు సవిస్తరముగ దెల్పుడని యర్థించెను.

అంతనాముని యిట్లు వివరించెను. పూర్వజన్మమున యీ సత్యరథుడు పాండ్యరాజు. వాని భార్యయు క్రిందటి జన్మమున పాండ్య రాజు భార్యయే. వారి కుమారుడే యీరాజ కుమారుడు. ఒకనాడు పాండ్య రాజు సాయంసమయమున యీశ్వరార్చన యందుండెను. అప్పుడు పెద్దకల కలము వినిపించెను. అతని మంత్రి యొక శత్రురాజును బందీగా గొనివచ్చెను. బంధితుడైన వానిని పూజసమయమని యెంచక పాండ్య రాజు వధించెను. అందుచే తరువాత జన్మమున యుద్ధరంగమున అతడు మరణించెను. ఇక వీని భార్య తన సవతికి విషాన్నముపెట్టి చంపెను. అందుచే నామె మొసలి వాతబడెను. ఇక వాని కుమారుడైన యీ రాచ బిడ్డడు శివార్చన సమయమున శివార్చనము చేయక కడుపార భుజించి నిద్రించెను. అందుచేనిపుడు యీ జన్మమందు భిక్షాటనము చేయవలసి వచ్చెను. అని తెలియజేసి యింకను యిట్లు పలికెను.

సాయంకాల సమయమున యీశ్వరుని పూజ జరిపిన వారికి ఇహలోకమున భోగభాగ్యములు గలిగి పరమున శివలోకప్రాప్తి గలుగును ఇది వేదసమ్మతమైన నిజము. ప్రదోషకాలపూజ పరమేశ్వరునకు మిక్కిలి ప్రీతికరమైనది సాయంకాలమున యీశ్వరుని పూజించిన సమస్తదేవతలను

పూజించిన ఫలితము కలుగును. అని చెప్పుచు ఆ బ్రాహ్మణకాంత కుమారుని గూర్చి శాండిల్యుడిట్లు చెప్పెను. "నీ స్వంత కుమారుడు పూర్వజన్మమున యొక బ్రాహ్మణ శ్రేష్టుడు, కాని జీవనాధారమునకై జీవితాంతము దుష్టదానములను స్వీకరించి తాను మాత్రము యితరుల కేమియు పెట్టకుండ జీవించెను. అందుచే వానికిప్పుడు భిక్షాటనము ప్రాప్త మైనది. నీవు వీరిద్దరిచే సాయంకాల సమయమున శివపూజ గావింపుము. వీరి కర్మపరిపక్వమై వీరు పాపరహితులగుదురు. మేలు జరుగును."

అంతనా బ్రాహ్మణకాంత ఆబాలురనిద్దఱిని శాండిల్యమునికి అప్పగించెను. వారిని యీ దారిద్ర్యము నుండి విముక్తులను జేయ వలసినదిగా వేడుకొనెను. అంతనాముని వారిద్దఱిచే విధ్యుక్తముగా సాయం కాలమున శివార్చన చేయించెను. ఈ విధముగా నాల్గుమాసములు గతించెను. ఒకనాడా బాలురిర్వురును మధ్యాహ్నస్నానముకై నదికిజనిరి. అంతనా ప్రవాహమునుండి యొక ధనపుపేటికవచ్చి వీరికి దొరికెను వారు దానిని తల్లికి జూపిరి. ఆమె యిర్వురను పంచుకొనుడని చెప్పెను. కాని రాజపుత్రుడైన ధర్మగుప్తుడు దానిని ఆ విప్రబాలునకు యిచ్చివేసెను.

వీరు యౌవన వయస్కులైరి. ఒక దినమున వీరు యొక సరస్సునందు కొందరు గంధర్వకాంతలు జలకము లాడుచుండగా చూచిరి రాజకుమారుడైన ధర్మగుప్తుడు సరస్సునకు దగ్గరగాపోయి చూతము రమ్మని బ్రాహ్మణ యువకునడిగెను కాని అందులకాతడు నిరాకరించెను ధర్మగుప్తుడొక్కడే పోయెను. అందు మిక్కిలి సౌందర్యవతియైన గంధర్వ కాంత వీనిని ప్రేమించెను. తండ్రియైన చిత్రరధున కెఱిగించెను. ఈశ్వర ప్రేరణచే చిత్రరధుడంగీకరించి వారిర్వురకు వివాహము గావించెను. అంత ధర్మగుప్తుడు గంధర్వుల సహాయముతో శత్రురాజులను వధించి తన రాజ్యమును చేజిక్కించుకొనెను బ్రాహ్మణకాంతను తనస్వంత తల్లిగ భావించి అంతఃపురమున యుంచుకొని గౌరవించెను. ఈతని పూజల వలన, దుర్మరణముపొందిన అతనిని తలిదండ్రులకు సద్గతులు గలిగినవి.

80. విమలభక్త్యావేశము: నిజమైన భక్తిచే గలిగిన ఆవేశము.

## సీమంతిని కథ: సోమవార వ్రతమహాత్మ్యము

పరిశుద్ధ మనస్కులై సోమవారముల సాయంకాలమందు పరమేశ్వరుని పూజించిన వారికి యెట్టి ఆపదలును రావు. ఇందులకు యొక ఇతిహాసము గలదు.

ఆర్యావర్తమున కాళిందీనదీ తీరప్రాంతమును చిత్రవర్మ అనురాజు పాలించుచుండెను. అతడు యెన్నియో యజ్ఞయాగములు గావించెను. అతడు ఆశ్రితవత్సలుడు హరిహరభక్తుడు. బ్రాహ్మణ భక్తి గలవాడు. అతనికి ఎనమండుగురు పుత్రులు జన్మించిరి. చివరగా ఆరాజునకు యొక పుత్రిక జనించెను. దైవజ్ఞులను సంప్రదించి యామెకు సీమంతిని యని నామకరణము జేసిరి. ఆమె సౌభాగ్యవతి, కళావతి మాంగళ్యవతి, అఖిలోకసుందరి, ఆచారవతి, మహాసాధ్వియై సకల భోగంబులనుభవించునని జ్యోతిష్కులు పలికిరి. కాని దుష్టుడైన యొక బ్రాహ్మణుడు ఆ బాలిక పదునాల్గవయేట వైధవ్యము జెందునని చెప్పెను. అంత రాజుమనసు విషాదముతో నిండెను.

బాలిక దినదిన ప్రవర్ధమాన మగుచుండెను, అయిదవయేట అక్షరాభ్యాసము గావించిరి ఆమెకు పండ్రెండు సంవత్సరముల వయస్సు నాడు యథాలాపముగా తనకు 14వ యేట వైధవ్యము గలదని ఆమె చెలికత్తెలద్వారా తెలుసుకొనెను. అంత నామె ఖేదపడి తమ గురుపత్నియైన మైత్రేయివద్దకు పోయి మొరపెట్టుకొనెను. సౌభాగ్యవతిగానుండుటకు యేవ్రతము చేయవలయునో సెలవిండని మైత్రేయిని ప్రార్థించెను. సాలకం తసహితురాలైన గౌరిని పూజింపుమని ఆమె ఆదేశించెను. ప్రతి సోమవారము సాయంకాల సమయమున శంభు సహితయైన శాంకరిని పూజించు విధానము ఆ బాలికకు యుపదేశించెను. పూజయైన పిదప బ్రాహ్మణులకు పూజించి బ్రాహ్మణ ముత్తైదువలను సముచితముగా కానుక లొసంగి పూజింపుమని చెప్పెను.

మైత్రేయి ఆదేశించిన ప్రకారము సీమంతిని సోమవారపు వ్రతము గావించు చుండెను ఆమె నిండు యౌవనవతి యైనది తండ్రి చిత్రవర్మ యామె పెండ్లిసేయ తలపెట్టెను. ఇంద్రసేన మహారాజు పుత్రుడైన చంద్రాంగదుని యిచ్చి ఆ సీమంతిని వివాహము జరిపిరి. కొన్ని దినము లీదంపతులు హాయిగా వినోదించిరి. అంత నొకనాడు చంద్రాంగదుడు అరణ్యమునకు వేటకై బయలు దేరెను. మార్గమధ్యమున యమునా నదిని దాటుచుండుగా వారి నావ నదిలో మునిగిపోయినది. చంద్రాంగదుని జాడ తెలియలేదు. సీమంతిని మాత్రము భర్త జీవించియే యుండునని నిశ్చయించినది. ఆ మిత నిష్ఠతో నంతఃపురమున సోమవారవ్రతమును పార్వతీ పరమేశ్వరుల గూర్చి సేయు మొదలిడినది. ఇట్లు మూడు సంవత్సరములు గడచినవి.

ఇట యమునా నదిలో మునిగిన చంద్రాంగదుడు యొక మిక్కిలి లోతైన హ్రదములో చేరెను. అచట అతనికి నాగకన్యలు కనిపించిరి. ఆ కన్యకలు రాజకుమారుని అందమునకు ముగ్ధులై ఆ చంద్రాంగదుని పాతాళలోకమునకు గొని పోయిరి వీనిని జూచిన తక్షకుడు వివరమ్ము అడిగెను. నలుని పుత్రుడైనయింద్రసేనుని కుమారుడనని చంద్రాంగదుడు తను యమునలో మునిగిన వైనము తెలియ జెప్పెను. చంద్రాంగదుడు పరమశైవాచార సంపన్నుడని తెలుసుకొని తక్షకుడు వానిని నాగలోక రాజధానియైన భోగవతియందుండు మని ఆహ్వానించెను కాని చంద్రాంగదుడు దీనముగా వేడు కొనిన మీదట, తక్షకుడు కరుణించి దివ్యభూషణములను కామగమనము గల యొక గుర్రమును, చంద్రహాసమను కత్తిని అమ్ము అమ్ములపొదులను వానికి బహుమానముగా నిచ్చి మహా బలవంతుడైన యొక రాక్షసుని పిలిచి చంద్రాంగదుని భూలోకమున విడచి రమ్మని బంపెను ఆపదలలో నున్నప్పుడు తలచుకొనిన సహాయపడగల నని గూడ తక్షకుడు పలికెను.

అంతట కాళిందీ తీరమున నీటి నుండి చంద్రాంగదుడు భూమిపైకి వచ్చెను. బ్రాహ్మణ కాంతలతో పార్వతీ పూజకై స్నానమునకు

చేయుటకు యమున యొడ్డునకు వచ్చిన సీమంతిని తన భర్తయైన చంద్రాంగదుడు సజీవుడై మరలివచ్చుట కనుగొని మిక్కిలి ఆనందించెను. చిత్రవర్మ యింద్రసేనుడు వీరిద్దరకును పునర్వివాహముచేసి సుఖంబుండిరి ఆమె సలిపిన సోమవార వ్రతమహాత్మ్యమువలననే ఆమె మరల భర్తను పొంద గలిగినది.

సీమంతిని ప్రతి సోమవారము విడువక పార్వతీ పరమేశ్వరులను పూజించుచూ బ్రాహ్మణ దంపతులకు కానుక లొసంగుచుండెడిది. ఒక గ్రామమున సుమేధుడు, సోమవంతుడు అను యిద్దరు బ్రాహ్మణ యువకులు గలరు. వారు సకల పురాణేతిహాసములను అభ్యసించిరి. వారు యొకనాడు విదర్భరాజు నొద్దకుపోయి వారి పాండిత్యముతో వానిని మెప్పించి కానుకలందుకొన గోరిరి. విదర్భరాజు హాస్యమునకై వారిలో యొకరి స్త్రీ వేషమువేయించి దంపతులవలె సీమంతిని వద్దకు పంపి ఆమె వద్ద బహుమానములు పుచ్చుకొనిరమ్మని ఆదేశించెను. అట్లు మోసము చేయుటవారికి యిష్టము లేకపోయినను రాజాజ్ఞ గాన జవదాటవీలులేనిదని వారు దంపతులవలె సీమంతిని వద్దకు పోయిరి.

ఆ దినము వ్రతము ముగించుకొని సీమంతిని దేశదేశముల నుండి వచ్చిన బ్రాహ్మణ దంపతులకు కానుకలిచ్చు చుండెను. అందు కృత్రిమ వేషములతోనున్న ఈ బ్రాహ్మణ యువకులును యుండిరి. ఆమె వారు నిజమైన దంపతులని భావించి వారిని పూజించెను. ఆకారణముచే స్త్రీవేషము ధరించిన యువకుడు నిజమైన స్త్రీగా మారెను. అది తెలుసు కొనిన వారు సోమవార వ్రతమహాత్మ్యము సీమంతిని నిష్ఠను బహు ప్రకారంబుల ప్రశంసించిరి. (బ్రహ్మోత్తర ఖండమునుండి)

82. భద్రాయువను రాజునకు ఋషభుండను ముని శివకవచమునుపదేశించి వానిని రక్షించెను: దుర్జయుడను రాజు శాపవశమున బ్రహ్మ రాక్షసుడై సంచరించెను. వాడొకనాడు వామదేవ మహర్షిని భక్షింపగోరి ఆయనపై దుమికెను. పంచాక్షరీమంత్ర ప్రభావుడైన వామదేవుని స్పర్శచే

వాని రాక్షసత్వము నశించి శాపమంతమైనది. ఆ వామదేవుడు వానికి విభూతి యొక్క మహిమను వివరించెను.

వామదేవుడిట్లు చెప్పెను. పరమేశ్వరుని విభూతిమహాత్మ్యము వర్ణింప నలవిగాదు. చండకుడనునొక శబరుడు గలడు. వానికి యొకనాడు అరణ్యమున యొక జీర్ణదేవాలయమునందు శివలింగము కన్పించినది. పూర్వజన్మకృత పుణ్యంబుగా భావించి వాడాలింగమును తన గ్రామమునకు దెచ్చి భార్యాసహితుడై భక్తి శ్రద్ధలతో పూజించుచుండెను. ఆ లింగమును పూజించు విధానము తెలియక యొకరాజు కుమారుని యెట్లు పూజించవలయునని అడిగెను. అంత నారాజకుమారుడు పరిహాసపూర్వకముగా శివలింగ పూజావిధానమును వానికి జెప్పెను. "తొలుత అభిషేకము జేయుము పీఠమునందు ప్రతిష్ఠింపుము గంధము అక్షతలు పుష్పములు ధూపము దీపములతో పూజింపుము. తరువాత పరమేశ్వరునకు చితిభస్మము ఉపహారముగా నొనర్చుము, తరువాత నీవు భుజించదలచు అన్నమును నైవేద్యమొసంగుము మంత్రపుష్పవందనాదులు గావింపుము" అని చెప్పెను.

ఆ విధముగా ప్రతిదినము ఆ శబరదంపతులు శివపూజ నిష్టతో చేయుచుండిరి. అంతనొకనాటిపూజకు చితాభస్మము లభించలేదు. శబరుడు విచారవదనుడై పూజ ఎట్లుచేయవలెనోయని మథనపడుచుండెను అంతవతని భార్య విషయము తెలుసుకొని "అయ్యా దీనికింత విచారమేల నా శరీరమును దహించి పరమేశ్వరునకర్పింతమని భర్తను యొప్పించెను. వెంటనే చితినేర్పాటుజేసి వాని భార్య శివుని ధ్యానించుచు ఆ మంటలలో ఆత్మాహుతి జేసుకొనెను. అంత భార్య చితిభస్మమును శివునికర్పించి వివశుడైపడియున్న శబరునకు దివ్యదేహముతో భార్య కన్పించెను వెన్వెంటనే ఆ శబరుడుని అగ్నికాహుతి అయ్యెను. అంతట శివుడు దివ్య విమానముపంపి వారికి శివలోకవాసమొసంగెను.

# రుద్రాక్షధారణ మహాత్మ్యము :-

రుద్రాక్షలను ధరించినవారు యీశ్వరుని కృపకు పాత్రుల గుదురు. వారి పాపములు నశించును. ఇందులకునొక యితిహాసము గలదు ఈ కథను పరాశరుడు భద్రసేనుడను మహారాజునకు జెప్పెను.

ఒకనాడు పరాశరమహాముని భద్రసేనుని ఆస్థానమునకు వచ్చెను. ఆ మహామునికి సకలోపచార పూజలుజరిపి, ఆ రాజు పరాశరుని ప్రార్థించి యిట్లడిగెను. ఓ మునీంద్ర నా కుమారుడైన సుధర్ముడు, మా మంత్రి కుమారుడైన తారకుడు నిరంతరము రుద్రాక్ష పేరులను ధరించి యుందురు. బాలురుగదా అలంకారయుతమైన భూషణములు ధరింపరు వాటియందు వీరికి విముఖత. దీనికి కారణమేమి? అని పలికెను. అంత పరాశరుడిట్లు పలికెను.

కోసలదేశమున నందియను పేరుగల గ్రామము గలదు. ఆ గ్రామమున మనోనందిని యను వేశ్యగలదు. ఆమె వేశ్య అయినను శివభక్తి ధురంధరురాలు, ధర్మము. సత్యము మొదలగు సద్గుణములు గలది. ఆమెకుగొన్ని నియమములు గలవు దుర్మార్గులతోను, త్రాగుబోతులతోను ఆమె వ్యభిచరించదు. ఆమె వేడుకగానొక కోతిని, కుక్కను పెంచుకొనెను. ఆమె ఆరెంటికి రుద్రాక్షమాలలు అలంకరించెను. ఈ విధముగా వాటితో నాడుకొనుచు పరమ శైవాచారపరురాలగుచు ఆమె జీవించు చుండెను.

ఒకనాడామెయింటికి విభూతి, రుద్రాక్షమాలలు ధరించి మహా ధనవంతుడైన వైశ్యుడు మిండజంగముగా వచ్చెను. అతను మహావిలువైన అతని ముంజేతికంకణమును ఆవేశ్యకొసంగెను. మూడుదినములు అతనితో గడుపుటకు ఆ వేశ్య అంగీకరించెను. ఆ మూడుదినములు భార్యగనుండె దనని ఆమె పల్కెను. అంతనతడు రత్నకంకణమామెకునిచ్చి యొక మణిమయము లింగమును అతిగోప్యముగ దాచుమని యామెకొసంగెను

ఆమెదానిని తన నాట్యశాలయందు దాచియుంచెను. ఆ రాత్రి ఆవైశ్యునితో నామె గడిపెను. ఆ రాత్రియే ఆమె నాట్యశాలకు నిప్పంటుకొని మంటలు చెలరేగెను. అమె పరుగు పరుగునవచ్చి ఆ మంటలలో చిక్కుకున్న శునక మర్కటములను కట్లూడ్చి బయటకు పంపివేసెను. అందులో దగ్ధమైము క్కలైపోయిన మణిమయలింగమును వైశ్యుడుచూచి తన వ్రతము భగ్నమ యినదని, ఆమెచేత చితి పేర్పించుకొని ఆ మంటలలో దూకి ప్రాణపరి త్యాగమొనరించెను. అంత నావేశ్య మూడు దినములు భార్యగనుండుటకు నిర్ణయించినది. గాన అతని భార్యననుకొని వానితోడిచేలోకమని ఆ వైశ్యుడు ప్రవేశించిన చితిమంటలలోనే దూకి ప్రాణములు పరిత్యజించ నిశ్చయించెను. తనకున్నందయు దానధర్మములు గావించి ఆ మంటలలో దూకనున్న సమయమున పరమేశ్వరుడు ప్రత్యక్షమయ్యెను. నిన్ను పరీక్షించుటకై వైశ్యునిరూపమున వచ్చితిని, నీ భక్తికి మెచ్చితిని, వరము గోరుమని ఆమెను అడిగెను. ఆమె శివలోకవాస మిప్పింపుమని పరమేశ్వ రుని ప్రార్ధించెను.

" ఓరాజా! ఆమె పెంచిన శునక మర్కటములే నీ తనయుడు సుధర్ముడును నీ మంత్రికుమారుడు తారకుడును, వారికి పూర్వజన్మ జ్ఞాన ముండుటచే ఈ రుద్రాక్ష భూషణములు ధరించుచున్నారు. క్రిందటి జన్మమున రుద్రాక్షధారణచే వారికి యీ జన్మమున యిట్టి యుత్కృష్ట జన్మము కలిగినది " అని పరాశరుడు చెప్పెను.

## 82. రాజునకు కుచంబు లింగముగా భాసించుట :-

పూర్వము శ్రీశైలమును పరమశైవాచార సంపన్నుడగు చంద్రగుప్త మహారాజు పాలించుచుండెను. రాజ్యపాలనయందు మిక్కిలి సమర్థుడు. అయినను వివేకజ్ఞానరహితుడు. ఆ రాజు స్త్రీలోలుడు. స్వపర భేదములేక కనిపించిన ప్రతి స్త్రీని పొందవలెననెడి కోరిక గలవాడు. కాని షట్కాల శివార్చనాపరుడు. అతడొక దినమున యొక వేశ్యయింటిలో కామకేళీసుఖంబులనుభవించి రాత్రి బాగా ప్రొద్దుపోయిన తరువాత

నిద్రించెను. ఆ కారణముచే వేకువనే ఆయనకు మెలకువరాలేదు. శివార్చనకు వేళ యతిక్రమించుచున్నదని ఉషఃకాల శివపూజ చేయవలెనని తలంచి సన్నిద్ధుడై లేచెను. పరిశుద్ధుడై వేశ్యకు చెప్పిపోవలెనని పడకటింటి లోనికి వెళ్ళెను. వేశ్య యింకను నిద్రలేవలేదు. ఆమె పరుండియున్న తీరులో ఆమె పయిటజారి ఆమె యొక్క రెండు స్థనములు రాజునకు కనిపించెను, శివపూజా ధ్యానమున ఆతురతగానున్న రాజునకు ఆ వేశ్య స్థనములు శివలింగములవలె భాసించెను. అంతనతడు ఆ స్థనములనే శివలింగములుగా భావించి ప్రభాతకాల శివపూజను జరిపెను. అతని శివ భక్తికి పరమేశ్వరుడుమెచ్చి ఆయనకు శివలోక పదవినిచ్చెను.

## మేకపెంటిక శివలింగము రూపొంది గొల్లవానికి మోక్షమిచ్చుట :-

కోటప్పకొండవద్దనొక అగ్రహారము గలదు. ఆ అగ్రహారమునందు శివశర్మయను నొక శైవనైష్ఠికుడైన బ్రాహ్మడు గలడు. అతడు యుదముననే ప్రతిదినము శివునకు క్షీరాభిషేకము చేసెడివాడు, శివునకభిషేకమునకు వలయుపాలు ఆ కొండ ప్రక్కనేయున్న యొక గొల్లపల్లె నుండి కాటకోటడుయను నొక గొల్లవాడు తెచ్చియిచ్చు చుండెడివాడు. ఒకనాడు యెడతెరపిలేని వర్షము కురిసినది. కొండపైనున్న వాగులన్నియు పొరజొచ్చినవి. ఆ బ్రాహ్మణాగ్రహారమునకు గొల్లపల్లెకు మధ్యనొక పెద్ధ వాగు గలదు. ఆ దినము గొల్లవాడు ఆ వాగుదాటి పాలు తెచ్చుటకు చాలా అలస్యమైనది పాపము శివశర్మ యుదకాల శివార్చనకు వేళమించిపోయినది. అందుచేతనతడు కోపముతో తనకు పాలుయిచ్చు కాటకోటిని దూషించుచూ ఆలస్యమునకు కారణము చెప్పుమని అడిగెను.

అంతనాగొల్లవాడు వాగులుపొంగి యుండుటదెల్పి ఆ బ్రాహ్మణుని " అయ్యా! మీరు మిక్కిలిభక్తితో ప్రతిదినము శివార్చన చేయుదురు కదా! ఆ శివుడెట్లుండును " అని ప్రశ్నించెను పాలు ఆలస్యముగా తెచ్చెనను కోపముతో హేళనగా ఆ బ్రాహ్మణుడు గొల్లవానితో మేక

పెంటికవలె శివుడుండునని చెప్పెను. అంత అమాయకుడైన గొల్ల నిజమని నమ్మి ఆ దినమునుండి బ్రాహ్మణునకు పాలు యీయక, తన మందలో మేకలు వేసిన పెంటికలన్నియు శివమూర్తులేయని భావించి పాలన్నియు ఆ పెంటికలపై పిదుకుట మొదలిడెను. ఆ గొల్లవాని తండ్రి బ్రాహ్మణునకు తనకొడుకు పాలీయలేదని తెలుసుకొని, పాలన్నియు యేమిచేయుచున్నావని అడిగెను. అంతవాడు శివునకు అభిషేకము చేయుచున్నానని చెప్పెను, వీని శివపూజయెట్టిదో చూడవలెనని తండ్రి వానిని నీవు చేయు శివపూజయేమి అని ప్రశ్నించెను. చూపుమని కోరెను. అంతనాకాటకోటడు తండ్రిని దీసుకొనిపోయి తాను మేకపెంటికలకు చేయు పూజ చూపెను. తండ్రి కోపముతో మేకపెంటిక నీకు శివుడా అని హేళన చేయుచు,ఆమేక పెంటికలన్నింటికి కాలితో దన్నెను. శివునకు జరిగిన యవమానమును భరించలేక ఆ గొల్లవాడు తండ్రిని నరికివేసెను. అంతనా మేకపెంటికయే నిజమైన శివలింగముగా భాసించి శివుడు ప్రత్యక్షమై ఆ గొల్లవానికి శివలోకప్రాప్తి కలిగించెను. వానికోరిక మేరకు వాని తండ్రిని మరల బ్రతికించెను. ఆ క్షేత్రమేనేడు కోటకూటేశ్వర క్షేత్రముగా ప్రసిద్ధి చెందినది. (పూర్వగథాలహరి)

## వంగకాయలు ప్రాణలింగంబులగుట ;-

బసవడు పరమశైవభక్తుడు. అతడు ప్రతిదినము శివార్చనము గావించి యెందఱు శివభక్తులు వచ్చినను వారందఱికిని భోజనములు బెట్టును. ఆ శివభక్తులు వీరశైవాచారులై యుండవలెను. వీరశైవాచారుల వద్ద ఈశ్వర ప్రాణలింగములు నిక్షిప్తమై యుండును.

ఒక దివమున కొందఱు దొంగలు భోజన సమయమునకు బసవని యింటికి వచ్చిరి. వారియొద్ద ప్రాణలింగములు లేవు. వారు వంగ కాయలను మూటగట్టుకొని శివలింగములని నమ్మించిరి. బసవన్న వారి నందరిని లింగధారులని భావించెను. కాని నిజమైన లింగములులేని ఆ దొంగలందరును భయపడిరి. బసవన్న వారినందఱిని "ఈశ్వరార్చన

కొంకక వేయుడు కూర్చుండుడు " అనెను. ఆ దొంగలు తిరిగిపోలేక గూర్చుండి లింగసహితులవలె జేతులుచాపి చూపిరి. ఆ బసవనియుక్క భావప్రభావముచే వారి యొద్దనున్న వంగకాయలన్నియు ప్రాణలింగము లయ్యెను.

## కుంచము లింగమగు కథ :-

బల్లేసుమల్లయ్య యనునొక సెట్టి గలడు. అతడు షట్కాల శివార్చనాశీలుడు శివలింగస్పర్శ అర్చనలేనిదేయాతడు భోజనముసేయుడు అతడొకదినమున వ్యాపారనిమిత్తము మరికొందఱు వర్తకులతో గ్రామాంతరము వెళ్ళెను. ఆ గ్రామమున శివాలయముగాని శివలింగముగాని లేదు. శివార్చనసేయనిదే ఎట్లు భుజింతునని పాపమాతడు మథనపడుచుండెను. తోడివర్తకులు శివలింగములేనిదే యాతడు భోజనములేక మానసికముగా బాధపడి చచ్చునని భావించిరి అపుడందఱును కూడబలుకుకొని హేళనగా యొక గుడియాకారమును పూరిగడ్డితో నిలిపిరి అందులోనొక కుంచమును నిలిపి దానిపై తెల్లటిగుడ్డకప్పి కొండగోగుపూలు నిండుగా పూజించి యిదే శివాలయమని మల్లన్నకు చూపిరి. మల్లయ్య నిజమైన గుడిగా దానిని భావించి, అందలి కుంచమునే లింగమనుకొని దాని చుట్టు ప్రదక్షిణము చేసెను. శివుని భక్తితో పూజించెను, ఆ తరువాత భోజనము చేసెను,

అంత తోడివర్తకులు యీ మల్లయ్యకుంచమునే లింగమనుకొని పూజించి భుజించెను, ఆకటికక్కుర అయినదే దైవమని నవ్వి హేళన చేసిరి. మల్లయ్య ఆ హేళనను భరించలేక శివశివాయని చెవులుమూసుకొని వారి మాటలనుఖడించి తాను నిజమైన శివలింగమునకే మ్రొక్కితినని జెప్పెను. కావలసిన రండి నేనుచూపెదనని వారందఱిని అచటికిదీసుకొని పోయెను. ఆ పూరిగుడిసెయున్నచోట చక్కని అలయము వెలసియుండెను అలయ ప్రాంగణమున నందికేశ్వరుడుండెను. కుంచము పెట్టినచో చక్కనైన లింగము కుదురుకొనెను. ఇది బల్లేసుమల్లయ్య భావించుటచే యీ ఆలయమునందలి శివుడు బల్లేశ్వరుడు. పై కథనుబట్టి పరమేశ్వరుడు

ఎవరే రూపమున భావింతురో వారికట్లే కన్పించును అతడు "చిన్మరేజ విహార మత్త మధుపము"

83. ఓ శ్రీముఖలింగవాస! పరమేశ్వర సకల చరాచర సృష్టియందంత టను నిండియుండు మూలపురుషుడవు, కూటస్థుడవు నీకు ఆది మధ్యాంతములు లేవు నీదగు పరమలింగాకారమునకు మొదలు తుది తెలుసు కొనవలెనని బ్రహ్మయు విష్ణువు ప్రయత్నించిరి వారికి సాధ్యపడలేదు అంతటవారు అహంకారమును వీడి నిన్ను ప్రార్థించిరి. దయా సముద్రుడువైన నీవుసుగుణరూపమున వారలకు దర్శన మిచ్చితివి నీ యొక్క మహామహిమలను వారు కొనియాడిరి నిన్ను దర్శించివారు మిక్కిలి పరవశులైరి అహంకారమును విడిచి యెవరు నిన్ను ధ్యానించి పూజింతురో వారికి మోక్షమబ్బును.

84. పార్వతి శివుని చేపట్టు కథ

దక్షయజ్ఞ ధ్వంసము నందు ఆత్మాహుతి గావించిన దాక్షాయణి హిమవంతునకు మేనకకు పుత్రికగా జన్మించెను. అమెకు పార్వతి యని పేరిడిరి. ఒకనాడు నారదమునీంద్రుడు ఓషదీ ప్రస్థము (హిమవంతుని రాజధాని) నకు వచ్చి పార్వతి పరమేశ్వరునకు ధర్మపత్ని కాగలదని చెప్పెను.

దక్షయజ్ఞ ద్వంసము తరువాత సతిని కోల్పోయిన యీశ్వ రుడు హిమాలయములకు వచ్చి తపస్సమాధిలో నుండెను. ఆ వైనము నారదుని ద్వారా తెలుసుకొనిన హిమవంతుడు మేనక యీశ్వరుని సపర్యలకై పార్వతిని నియోగించెను. పార్వతియు పరమేశ్వరుని భర్తగా పొందగోరి సపర్యలు చేయుచుండెను.

ఆమె కార్యసాధనకు దోహదముగా దేవకార్యము అను సం ధానమైనది. తారకుని సంహరించుటకు పార్వతీ పరమేశ్వరుల గర్భజాతుడు దేవసేనాని జన్మించవలసిన సమయ మాసన్నమైనది. దేవేంద్రుడు పార్వతీ పరమేశ్వరులను యేకముచేయుటకై తహతహ

లాడుచుండెను. మన్మథుని సహాయమర్థించెను వానికి వసంతము తోడుగవచ్చినది. పరమేశ్వర తపోస్థలి శృంగారపూరితమైనది. నాడు యీశ్వరుని మెప్పించవలెనని పార్వతి, త్రిభువన సౌందర్యరాశి, ముగ్ధమోహనముగా నలంకరించుకొని పూజా ద్రవ్యములతోయీశ్వరుడు తపస్సుచేయు ప్రదేశమునకువచ్చెను తన కరుణాదృష్టులకై తపించి తనకు సపర్యలు చేయవచ్చు చున్న పార్వతిని కనులు తెరచి యీశ్వరుడు చూచెను. పొంచి యున్న మన్మథుడు తన పూబాణములను పార్వతి పరమేశ్వరు లపై సంధించెను. క్షణకాలము యీశ్వరుని మనస్సు చలించి నది. పరమేశ్వరుడు నివ్వెరబోయెను. తేరుకొనెను. కారణము మన్మథుని వికారచేష్టగా గ్రహించెను. తన ఫాలలోచనము తెరచెను. ఆ కంటిచిచ్చులో మన్మథుడు దగ్ధమయ్యెను. పరమే శ్వరుడు అంతర్ధానమయ్యెను. పార్వతి నిరాశజెందెను. పరమే శ్వరుని అనుగ్రహముపొందలేని తన సౌందర్యము నిరర్థకమని యెంచెను. హిమవంత, మేనకలు పార్వతిని అంతఃపురమునకు తీసుకొనిపోయిరి.

పార్వతి ఖిన్నవదనయై పరమేశ్వరుని పొందలేని తన దురదృష్ట మునకు విచారించుచుండెను. పై పై విలాసములకు పరమేశ్వ రుడు సాధ్యపడడని గ్రహించి కఠోరనిష్టతో పరమేశ్వరునియను గ్రహమునకై తపస్సుచేయ దలపెట్టెను. తలిదండ్రులు ఆమెను యీ కఠిన ప్రయత్నము నుండి విరమింపజేయుటకు యత్నిం చిరి. కాని పార్వతి తన నిర్ణయమును మార్చుకొనలేదు. అలం కారములు దొలగించి తపోయోగ్యమైన నారచీరలను ధరించినది మండువేసవి పంచాగ్ని మధ్యమున, వర్షాకాలమున ఆరుబయల శీతాకాలమున కుత్తుకబంటి నీటినుండి కఠోర పరిశ్రమతో పరమేశ్వరుని గూర్చి తపస్సు చేసినది, తపోదీక్షలోనున్న ఆమెను జూచుటకు వృద్ధులైన యోగీశ్వరులు వచ్చిరి. ఆమెను అభినందించిరి.

ఈ విధముగా తపోదీక్షలోనున్న పార్వతి తపోవమునకు వర మేశ్వరుడు కపట బ్రహ్మచారి వేషమున వచ్చెను. ఆమెను కప్పించెను. గేలిచేసెను. అమె తపస్సు మాన్పుటకు పలుపోక డలుపోయెను. చివరకు యీశ్వరుని నిందించుటకు పూనుకొనెను ఈశ్వరనిందకు పూనుకొనిన అ మాయా బ్రహ్మచారిని పార్వతి సఖులచే ఆశ్రమమునుండి గెంటించుటకు యత్నపడెను. అంత పరమేశ్వరుడు నిజరూపముతో ప్రత్యక్షమై ఆమె కోరికను తీర్చెను. ఈ విధముగా పార్వతి తన సౌందర్యముతో పొంద లేని పరమేశ్వరానుగ్రహమును తపోదీక్షతో సాధించెను. పర మేశ్వరుని దయాసాధనకు వేషభాషలు ముఖ్యముగాదు. భూత దయగల్గి యుండవలెను.

## 85. యాదవరాజు దాసికి జుత్తువచ్చినగాధ

నేటి కాళహస్తి ప్రాంతము పూర్వము యాదవరాజు పాలించెను అతడు పరమ శివభక్తుడు. అతని భక్తిని తెలుసుకొనవలెనని పరమేశ్వరునకు బుద్ధిపుట్టెను. ఈశ్వరుడు మిండ జంగము వేషమున యాదవరాజు పాలించు పట్టణమైన నారాయణవనము నకు వచ్చెను మిండజంగమనగా యవ్వనములో విలాసములను దేలు శివభక్తుడు. ఆ వచ్చిన మిండజంగము సాక్షాత్పరమేశ్వ రుడుగాన, వానిని జూచిన స్త్రీలందరునుమోహపరవశులైరి.

ఆ వీధిని యొక మహాఅందగత్తె అయిన జంగమురాలు వచ్చు చుండెను. ఆమె అందచందములనుగాంచి చలించని యువకులు ఆయూర యుండలేదు. అంతట అందగత్తె మిండజంగము వేష మున వీధిని వచ్చుచున్న పరమేశ్వరుని గాంచెను. అతడు యామెకు విభూతినందించెను. ఆమె దానిని నొసటదాల్చెను. ఆ దినము జంగమార్చనకు తన యింటికి రమ్మని పిలచెను. ఆమె భక్తికి శివుడు సంతోషించి యామె యింటికి వెళ్లుటకు

అంగీకరించెను. ఆమె వెంట యామె యింటికి వెళ్ళెను.

ఆమె జంగమురూపమున యున్న పరమేశ్వరుని పూజించెను. తన సర్వస్వము పరమేశ్వరునకు యర్పించెను. వారి ఇద్ధరును కామకేళీవిలాసములలో దేలియాడిరి. ఈ జంగము రాలికి రాజు అంతఃపురమున యొక యుద్యోగమున్నది. ఆమె రాజు భోజనముసేయు సమయమునకు బంగారుపళ్లెము అమర్చవలెను. కాని ఆమె యీ విషయమును మరచి మిండజంగము రూపమునయున్న యీశ్వరునితో రతికేళీవిలాసములలోనున్నది సమయమునకురాని యీ దాసిపై రాజునకు కోపము వచ్చెను. సేవకులను పంపి యామెను పట్టి తెప్పించెను.

ఆమె తప్పునకు శిక్షింపదలచెను. ఆమె మనోహర సౌందర్యమునకు వెలితియని దలంచక యామె శిరస్సు గొరిగించెను. పాపమాదాసి యేడ్చుకొనుచు బోడితలతోబోయి పరమేశ్వరుని పాదములపైబడెను. హృదయ విదారకముగా విలపించెను పరమేశ్వరుడు కరుణించి జగద్రక్షక సమర్థమైన తన చేతిని యామెబోడి తలపై నుంచి యొక్కసారి నిమిరెను. పూర్వము కన్న మిక్కిలి దట్టముగ, అందముగ యామెకు జుట్టువచ్చెను. అంతనామె రాజు నొద్దకుపోయెను. రాజునకాశ్చర్యము కలిగెను మంగలిని అనుమానించెను. కాని దాసి తన యింటి వద్ధనున్న మాయాజంగము మహిమవలన తనకు మరల జుట్టు వచ్చినదని చెప్పెను. అంతరాజు ఆ మాయాజంగము మహాత్మ్యము తెలుసుకొనగోరి ఆయనవద్దకు వెళ్ళెను. మాయాజంగము రూపమున నున్న పరమేశ్వరుడే ఆ యాదవరాజునకు శ్రీకాళహస్తీశ్వరుని మహిమకు సంబంధించినకథలను చెప్పెను. (కాళహస్తి మహాత్మ్యము నుండి)

# ఊర్ణనాభుని కథ

శ్రీకాళహస్తి అను పేరులోని "శ్రీ" కి సంబంధించిన కథ యిది శ్రీ అనగా సాలెపురుగు. ఊర్ణనాభమనినను సాలెపురుగే కాళ మనగా పాము, హస్తి యనగా యేనుగు ఈ మూడు జంతువులును తమ శివభక్తి పారమ్యముచే ముక్తినంది శివునిలో నైక్యమయినవి. శ్రీకాళహస్తిలో గల శివలింగము చాలా పొడువైనది. అ లింగమునందు సాలెపురుగు, పాము, ఏనుగులు కలిసిపోయిన లక్షణములు గలవు ఈ మూడింటికి మోక్షమిచ్చినవాడు గాన అచటి శివునకు శ్రీకాళహస్తీశ్వరుడను పేరు కలిగినది అపట్టణమునకు శ్రీకాళహస్తి యను పేరు ప్రసిద్ధమైనది ఆంధ్రదేశమునందలి ముఖ్యమైన శివక్షేత్రములలో శ్రీకాళహస్తి యొకటి. ఇందలి మొదటి సాలెపురుగు కథయే యూర్ణనాభుని కథ ఈ కథ కృతయుగమున జరిగినది.

విశ్వకర్మ కొడుకు యూర్ణనాభుడు అతడు బ్రహ్మ సృష్టికి దీటుగా ప్రతి సృష్టి జేసెను. దానికి బ్రహ్మ కోపించెను సాలెపురుగుగా జన్మించుమని వానిని శపించెను అంతట విశ్వకర్మ కొడుకు సాలెపుర్వుగా జన్మించెను. వాని పూర్వపుణ్య విశేషముచే శివభక్తిసంపన్నమయినదా సాలెపురుగు. సాలెపురుగు చేయగలిగి యొక్కటే. దాని కడుపులో నుండి దారముతీసి రకరకములుగా గూడులల్లును. అ గూడులో చిక్కుకున్న చిన్నచిన్న క్రిమికీటకాదులను తిని జీవించును. కాని యీ యూర్ణనాభుడట్లు చేయలేదు.

ఈ సాలీడు నివశించుచోట యొక శివలింగము కలదు. దీనికి జన్మతఃశివభక్తి అబ్బినది. అందుచే నదియచటగల శివునకు తన దారముతో గుళ్ళు గోపురములు ప్రాకారములు, కొలువు కూటములు కళ్యాణమంటపములు నిర్మించినది. ఆ శివునియొద్ద గణపతి కుమారస్వామి, నంది, విష్ణువు, అష్టమాతృకలు గలరు. జగన్మాత

యిచట జ్ఞాన ప్రసూనాంబికయై వెలసినది. ఆ సాలెపురుగు వారం దరికిని గుళ్లు గోపురములు కట్టినది. ఉదయకాలమున వాటిపై మంచుబిందువులు పడి యివి అన్నియు ముత్యాల యిండ్లవలె కని పించును. ఉదయకాలమున ప్రభాకరుని అరుణకాంతులు వాటిపై బడి అవి అన్నియు రత్నాల యిండ్లవలె ప్రకాశించును. వాటిని చూచి యీ సాలీడు మురిసిపోవుచుండును. అప్పుడప్పుడు పెద్దగాలి వీచుటచే ఆ యిండ్లదారములు అచ్చటచ్చట తెగిపోవుచుండును. పాపమీ సాలీడు తెగిపోయిన దారములను మరలమరల అతుకుచు విసుగు విరామములేక యుండును. ఇట్లు కొంతకాలము జరిగినది. ఈ సాలీడునకు క్షణము తీరికయుండదు. తెగిన దారములను అతుకుటలోనే దానికి సరిపోయెడిది.

శివునకు దానిభక్తిని పరీక్షింపలెనని కోరిక గలిగెను. శివుని యొద్ద అర్చకుడు వెలిగించిన దీపమున్నది. ఒక దినము శివుడు ఆ దీపమును పెద్ధగా మండించి సాలీడు నిర్మించిన యిళ్ళన్నియు తగులబెట్టించెను. పాపము దానికి యేడుపువచ్చెను. ఇది యేమి "ఈమర్మికొక యేడును, బడితికొక పెట్టను" అన్నట్టు నేను యేండ్లతరబడి శ్రమించి నిర్మించిన యిండ్లన్నియు యీ దీపము క్షణకాలములో మండబెట్టినదని దీపముపై కోపగించినది. ఈ దీపమును మ్రింగివేయవలెనని యనుకొనినది. దీపమును సాలీడు మ్రింగుట యనగా దానిపైబడి కాలిపోవుట, చనిపోవుటయే అందుకు సాలీడు సిద్ధపడి ప్రాణపరిత్యాగము చేసినది. శివుడు దాని భక్తికి మెచ్చి ప్రత్యక్షమై వరము కోరుమనెను. పునర్జన్మలేకుండ నన్ను నీలో కలుపుకొనమని సాలీడు కోరెను. శివుడు దానిని తనలో కలుపుకొనెను. ఈ విధముగా యూర్ణనాభుడు శివసాయు జ్యమునందెను.

## సర్పదంతులు మోక్షమునందిన కథ ;

శ్రీకాళహస్తిలోని కాళము హస్తి యీ రెండింటి కథయేయిది.

కాళమనగా పాము. హస్తియనగా యేనుగు. ఈ రెండింటి శివభక్తి తీవ్రతను మనమీకథలలో గమనించవచ్చును. ఇది యెవరైనను కట్టుకథలను కొందురు. కాని యివి ఆయా కాలములలో నిజముగా జరిగిన కథలు. ఎందుచేతననగా సాలీడు, పాము, యేనుగుల రూపములు శ్రీకాళహస్తి యందలి ఈశ్వరలింగమున మనము గమనించవచ్చును. ఎవరైన శిల్పి యిట్లు చెక్కెనని అనుకొందమన్న అట్లనుటకు వీలులేదు. ఎందుచేతననగా శ్రీకాళహస్తి యందలి ఈశ్వరలింగము అగ్నిలింగము దానిని ముట్టుకొన్నచో తగులబడిపోదురు. అచటి పూజారులే ఆ లింగమును తాకరు. అది చాలా పెద్దలింగము. దాని చుట్టునుయొక మంచె నిర్మించిరి. దానిపై కెక్కి పూజాదికములను నిర్వర్తింతురు. అందుచే యీ కథలు జరిగిననుటకు ప్రబల నిదర్శనము.

ఈ పాము యేనుగుల కథ త్రేతాయుగమున జరిగినది. ఈ పామును పూర్వము శివుడే శపించెను. పరమేశ్వరుడు ఇంద్రాది దేవతలు బ్రహ్మ విష్ణులు, అనంతడు, శేషుడు మున్నగువారు కొలువ పార్వతీ దేవితో కైలాసమున కొలువుండెను. ఆ కొలువునకు పాతాళము నుండి యీ పాము రాలేదు. దాని నిర్లక్ష్యమునకు కోపించి నీవు భూలోకమున పడియుండుము. కైలాసమునకు రావలదని కట్టడిచేసెను. ఆ పాము తప్పు తెలుసుకొని ప్రాధేయపడిన మీదట దానిని కనికరించి శాపాంతమనుగ్రహించెను. ఇక యీ యేనుగు శివుని ప్రమథగణములలో నొకడు వీడొకనాడు పార్వతీ పరమేశ్వరులేకాంత ముగానున్న సమయమున మదాంధుడై లోనికేగెను. వానిని పార్వతి శపించెను.

పాము పాతాళమునుండి విలువైన మాణిక్యములను రత్నములనుదెచ్చి శివలింగము చుట్టూపేర్చి శివుని పూజించి మురసిపోయెడిది. ఇది త్రేతాయుగమున ద్వాపరయుగముల సంధికాలము. ఈ విధముగ పాము ప్రతి నిత్యము పూజ చేసెడిది. త్రేతాయుగముపోయి ద్వాపర యుగము వచ్చినది. ఆ శివలింగమును సేవించుటకు యొక యేనుగు వచ్చినది. ఆ యేనుగు ప్రక్కనున్న సువర్ణముఖి నదిలో స్నానము చేసి

తొండమునిండుగా నదిలోని నీటిని తీసుకొనివచ్చి లింగమును అభిషేకించెడిది. మారేడు దళములను పువ్వులను తీసుకొనివచ్చి శివలింగము చుట్టుయున్న మణులను త్రోసివేసి, తాను తెచ్చిన పత్రిపుష్పములతో పూజ చేసెడిది. ఆ స్వామివద్దనున్నవి మణులనిగాని, అదియొక పాము పూజయనిగాని అనుకొనలేదు.

మరునాడు యుదయముననే పామువచ్చి తను చేసిన పూజ అమర్చిన మణులు త్రోసివేయబడి యుండుట చూచెను. ఎవడో నా పూజను భగ్నముచేసి విలువైన మణులను త్రోసివేసి స్వామికి ముళ్ల కంపలతో ఆకులలములతో కప్పెనని బాధపడెడది. వెంటనే ఆ పత్రి పుష్పములను తొలగించి తాను కొనివచ్చిన మణులతో పూజించెడిది. పాము వెడలిపోయిన కొంతసేపటికి యేనుగు వచ్చెడిది. ఎవడో తన పూజను భగ్నముచేసి స్వామికి రాళ్లతోను రప్పలతోను వెటకారపు పూజ చేసెనని దుఃఖించి వాటిని తొలగించి మరల మారేడు దళములతో పువ్వులతో పూజ చేసెడిది.

మరుచటి దినము మరలయుదయముననే పామువచ్చెను తను పూజించిన రత్నమాణిక్యములు త్రోసివేయబడి యుండుట చూచి తనవ్రతము భగ్నమయినదని యెంచి, తన పూజను స్వామి స్వీకరించ లేదనుకొని వ్యథజెంది మరల యేనుగు పూజను తొలగించి తను దెచ్చిన రత్నమాణిక్యములతో పూజించినది. తన వ్రతము భగ్నము కాకుండ స్వీకరింపుమని. శివుని వేడకొని వెడలిపోయినది. వెళ్ళినది కాని ఆ పామునకు మనసు మనసులోలేదు. నిద్రాహారములు లేవు. ఆనందవిహారములు లేవు. మరల యెప్పుడు తెలవాఱునో తన పూజయేమైనదో అని ఆందోళనజెందుచునే యున్నది.

పాము వెళ్ళిన తరువాత యేనుగు వచ్చినది. తన పూజించిన పత్రిపుష్పములు త్రోసివేయబడియున్నవి. యేనుగు చిన్నబోయినది. ఎవడో సనికటుకొని తన వ్రతము భగ్నము చేయుచున్నాడని యెంచినది.

శివుని నిలదీసి యడిగినది. ఆ రాళ్లురప్పలు నీకు ప్రీతియా? ఆ పూజ నెట్లంగీకరించితివి అని ఆక్రోశించినది. నా వ్రతము హానిజేసిన వానిని బ్రతకనియ్యనని, రేపటి దినమునకు తన పూజ భగ్నమయిన యెడల ప్రాణములర్పింతునని కోపముతో వెడలి పోయినది. నిద్రాహారములు మానినది, పిచ్చెక్కినట్లు తిరిగినది, ఎపుడు తెలవారును తన పూజను భగ్నము చేసిన వానిని పట్టుకొందునని తలచినది.

తరువాత దినము పాము శివునివద్దకు వచ్చినది. తన పూజలేదు. స్వామిమీద ఆకులలములే యున్నవి. మిక్కిలి కోపముతో బుసకొట్టినది. ఎవడు తన పూజ భగ్నము చేయుచున్నాడో గమనించవలెనని అనుకొనినది. ఏనుగు పూజించిన పత్రిపుష్పముల మధ్య నిశ్శబ్ధముగా దాగుకొనియున్నది.

ఏనుగునకు తన పూజ యేమైనదో యని యనుమానము పెండలకడనే వచ్చినది. ఆ దినము తన పూజ వెడలేదు. తన విరోధి భయపడెననుకొనెను. తన పూర్వజన్మపుణ్యముగా భావించెను. స్వర్ణముఖి నదికి వెళ్ళెను. అలవాటు ప్రకారము తొండములో నీరు పూరించుకొని వచ్చెను. ఆ నీటితో స్వామిని అభిషేకించెను. తొలిదినమున గల నిర్మాల్యములను తొలగించెను. మరల పూజచేయుటకు యుపక్రమించెను.

ఈలోగా అచట దాగియున్న పాము అదను చూచుకొని యేనుగు తొండమునందలి రంధ్రములోనికి దూరి ముక్కుద్వారా కపాలములోనికిపోయి అచట తిరుగనారంభించెను. పాపము యేనుగునకు తల బాధపట్టుకొనినది. ఘీంకరించినది చీదినది, ఏడ్చినది. మొత్తుకొనినది. అయినను పాము బయటపడలేదు. స్వర్ణముఖినదికి పరుగెత్తినది. తొండమునిండ నీరుపీల్చి అదే పనిగ యూదినది. ప్రయోజనము లేకపోయినది. అడవిలోనూరకే పరుగెత్తినది. కుంభస్థలమును చెట్లకు మోదుకొనినది ఏమియు లాభములేకపోయెను. చివరకు యేనుగు యిట్లునుకొనినది. నేను యెటు చావక తప్పదు. నా శత్రువైన పామును గూడ చంపి చచ్చెదను ఈలోగా తప్పించుకొనునేమో! అందుచే తొండమును బిగియచుట్టినది

మహావేగముతో కపాలమును పెద్దర్రమాసునకు మోదినది ఏనుగు తలపగిలి అందున్న పాము చితికి పోయినది. నెత్తురు వరదలై పారినది. ఏనుగు సైతము ప్రాణములు విడచినది. వారిద్దరుని రుద్రగణములు శాపవిమోచన మైనది. వారి నిజరూపములు వారికివచ్చినవి. వారు స్వామిని స్తుతించిరి, శివుడు ప్రత్యక్షమయ్యెను. వారిరువుని తనలో కలిపికొనెను. (కాళహస్తి మహాత్మ్యమునుండి)

తిన్ననికథ 32వ పద్యమున యివ్వబడినది.

86 ఓ శ్రీముఖలింగవాస! లంకేశుడైన రావణుడు నీకు పరమభక్తుడు నిన్నుమెప్పించుటకై యతడు తనచేతి ఖడ్గముచే వరుసగా తొమ్మిది తలలను ఖండించి యిచ్చెను. పదియవ తల ఖండింపబోగా వాని యొక్క భక్తి గరిమకు మెచ్చుకొని యతని అభీష్టములను నెరవేర్చి తివి. కాని అహంకార పూరితుడై రావణుడు తన భుజబలముతో నీ నివాసమైన కైలాసమును పెకలించుటకు ప్రయత్నించెను, వాని మదమునణచుటకు నీ బోటనవ్రేల వాని పాతాళలోకమునకు త్రొక్కి వాని యహంకారమునణచి వేసితివి. తన యహంకారమును తెలుసుకొని భక్తితో ప్రార్థింప వానిని మిక్కిలి కరుణతో గాపా డితివి. ఎవరు అహంకారమును వర్జించి సర్వము నీవేయని నమ్మి యుందురో యట్టివారికి వాత్సల్యముతో గాపాడుదునని యిందు మూలమున తెలుసుకొనవచ్చును.

87. ఓ శ్రీముఖలింగవాస! నీ యొక్క దయయను ధనము గల భక్తుని భాగ్యము యింద్రుని భాగ్యము కన్న ఘనమైనది. బలిచక్రవర్తి కొడుకైన బాణుడు నిన్ను పరమభక్తితో పూజించి నిన్ను మెప్పిం చెను. వాని కోరిక మేరకు నీవువాని పట్టణమును కాపుండి రక్షించి నావు. భక్తుని కోసమై మహావిష్ణువునితో గూడ యుద్ధము జేసినావు. నిన్ను యెల్లవేళల భక్తితో నర్చించువానిదే భాగ్యము నీ పాదపద్మ ములకు భక్తితోతలవంచి నమస్కరించువానిదే పుణ్యమైన శరీరము

# బాణాసురుని కథ :-

బలిచక్రవర్తికి నూర్గురు కొడుకులు. వారిలో పెద్దవాడు బాణాసురుడు. అతడు శివభక్తి ధురంధరుడు. శత్రు భయంకరుడు. వేయి చేతులు గలవాడు. అతడు తన పరాక్రమముచే యింద్రుని యోడించెను. పరమేశ్వరుని గూర్చి యంచిత భక్తిసంపన్నుడై తపమాచరించెను. శివుడు వాని భక్తికిమెచ్చి వరము కోరుమనెను. అంత బాణుడు పరమేశ్వరునిట్లని వేడెను. " దేవా! నీవు పార్వతీ సహితుడవై నా పురమగు శోణాపురము కోటవాకిట కాపుండి, నీ కరుణా కటాక్ష వీక్షణములచే మమ్ములను మా పురమును రక్షింపుము " అంత నీశ్వరుడు గౌరీసమేతుడై, విఘ్నేశ్వరాది ప్రమథగణములతో వాని నగరమగు శోణపురమువాకిట కాపుండెను.

అంతనొక దినమున బాణాసురుడు అహంకారము గర్వము మనసున నింపుకొని పరమేశ్వరుని పాదకములకు శిరసువంచి నమస్కరించెను. ఓ పరమేశ్వర యీ ముజ్జగములందు నా శౌర్యప్రతాపములకు నాగ గలిగిన వీరుడెవరునులేరు. నా వేయి చేతులు రణకండూతితో బాధించుచున్నవి. భయంకరమైన యుద్ధము చేయవలెనని కోరిక కలుగుచున్నది. నీవు దప్పనన్నెదిరించ గల వారెవరునులేరు. అనగానే యీశ్వరుడు " ఓయి మూఢుడా! ఎప్పుడు నీజయకేతనము భూమిపై కూలునో అప్పుడు నాయంతవానితో నీకు యుద్ధం గలుగును. అని చెప్పగా వాడు తన కేతనమెప్పుడు భూమిపైగూలునా యని చూడమొదలిడెను.

బాణాసురునకు ఉషయను పుత్రిక గలదు అమె యతిలోక సౌందర్యరాశి. ఆమె యొకనాడు కలగనినది. ఆ కలలో తన్నుమున్నెన్నడు చూడని బహురూపసియగుయొక యువకునితోకామకేళి జరిపినట్లు కలగనినది. నిద్రలేచి యిదికలయని భావించినది గాని, ఆమె బుగ్గలపై ముద్దులగాట్లు శరీరమునందు ఆభరణములు గ్రుచ్చుకొనిన గుర్తులు గమనించినది. అంతనామె తను కలజూచిన పురుషసింహుని పొందవలెనని మనసునందు గాఢము కలలో కోరిచింతా శోకయైనది.

బాణాసురుని మంత్రి కుంభాండుడను వాడుగలడు. వాని పుత్రిక మిక్కిలి సౌందర్యవతి చిత్రరేఖ ఆమె యుషాసుందరికి అనుంగు చెలియ ఆమె చిత్రకళ యందు మిక్కిలి ప్రవీణురాలు. ఆమె యుషాకన్య విచారగ్రస్తమై యుండుట గమనించి కారణమడిగెను. ఉషాకన్య తనయొక్క కలగూర్చి యామెకు చెప్పెను. అంతనా చిత్రరేఖ తన చిత్రకళా నైపుణ్యముతో ఆర్యావర్తమున గల రాజవంశములందలి రాజకుమారుల చిత్తరువులను లిఖించి యామెకు జూపెను. అందలి యాదవ వంశ రాజకుమారులలో శ్రీకృష్ణుని కుమారుడైన యనిరుద్ధుడే తనను కలలో గలసికొన్న రాకుమారుడుగా ఆమెగుర్తించెను.

అంత చిత్రరేఖ ఉషాకన్యకు యూరటబల్కి తానిప్పుడే యనిరుద్ధుని తోడ్కొని వచ్చెదనని చెప్పెను ఆకాశగమన విద్యాయందారి తేరిన చిత్రరేఖ తక్షణమే ద్వారకానగరమునకు వెళ్ళెను, తన యోగ విద్యా మహాత్మ్యముచే ఆ యనిరుద్ధునెత్తుకొని మనోవేగముతో శోనాపురమునకు గొనివచ్చెను. ఉషాసుందరి పడకటింటిలో హంసతూలిక తల్పముపై వానిని పరుండబెట్టెను, ఉషాసుందరి చిత్రరేఖకు కృతజ్ఞతలు దెల్పినది. అనిరుద్ధునితో గలసి సకల భోగములు తన యేకాంతమందిరమున అనుభవించ దొడగినది.

అనతికాలములోనే ఉషాసుందరి తల్లియగు సూచనలు గాన వచ్చినవి. ఈ విషయము గమనించిన చెలికత్తెలు బాణాసురునకు ఉషాసుందరి గర్భము దాల్చిన గుర్తులు కలిగియున్నదని విన్నవించిరి. అంత బాణుని దండనాయకులకు అనిరుద్ధునకు యుద్ధము జరిగినది. ఆ యుద్ధములో బాణుని సైన్యమును యనిరుద్ధుడు హతమార్చెను. బాణాసురుడు రోషావేశుడై యనిరుద్ధుని నాగపాశమున బంధించెను.

ఈ విషయము విన్న శ్రీకృష్ణుడు యనిరుద్ధుని రక్షించుటకు యాదవసైన్యముతో శోణపురం మీదికి దండెత్తెను. బాణాసురుని రక్షక చక్రము నంతయు నిర్మూలించెను. బాణాసురుడు శ్రీకృష్ణునిపైకి దండెత్తివచ్చెను. శ్రీకృష్ణుడు వాని సహస్ర కరములను ఖండించెను

బాణసురుడు శివుని శరణువేడెను. శివుడు శ్రీకృష్ణునితో యుద్ధముచేసెను. ఆయుద్ధపర్యవసానమున శివకేశవులకు బేదము లేదనువిషయము తేటతెల్లమయ్యెను. కృష్ణుడు బాణాసురుని క్షమించెను. ఉషానిరుద్ధుల వివాహాము జరిగినది. (భాగవతమునుండి)

88. ఓ పరమేశ్వర విష్ణువు నిన్ను పూజింప వేయిపద్మములను తీసుకొని వచ్చెను. విష్ణువుని పరీక్షింప నీవు అందొక పుష్పమును మాయ జేసితివి. అంత విష్ణువు ఆ పుష్పమునకు బదులు తనకంటిని నీకు అర్పించెను. నీవు సంతృప్తిజెంది విష్ణువు నేత్రమును సరిజేసి యీ సృష్టినంతను రక్షించుపదవి యాయనకొసంగితివి. సుదర్శన చక్రమును ఆయుధముగా నిచ్చినావు. భక్తులను రక్షించి పాలించు కళయందు నీవు అద్వితీయుడవు. నీకు వేయి నమస్కారములు.

89. ఓ శ్రీముఖలింగవాస! వైదిక కర్మలన్నియు నీదయ లేక ఫలితము నీయజాలవు. యజ్ఞయాగాదుల యొక్క ఫలితమునకు నీవుఅధికారివి నీవు యజ్ఞపురుషుడవు. సృష్టియందంతటను నిండియున్నవాడవు నిన్ను పూజింపని నీచమైన యజ్ఞములు దక్షునియజ్ఞమువలె ధ్వంసమగును. నీపూజ నిత్యము సేయుచు త్రికరణశుద్ధిగ వారివారి విధులను నిర్వర్తించువారికి సంపూర్ణమైన ఫలితము దక్కును. నీయందు విశ్వాసముంచి జీవనయాత్ర సాగించువారు యెన్నిటికి చెడిపోరు. భక్తులహృదయమే నీ నివాసస్థలము.

## 90. నత్కీరుని కథ :-

పాండ్యరాజు రాజధాని మధురానగరము. పార్వతిదేవి ప్రతిరూపమైన మీనాక్షిదేవి మధురానగరమున వెలసియున్నది. ఆమె పాండ్యరాజు కూతురు. సాక్షాత్తుపరమేశ్వరుడే ఆ రాజునకల్లుడు. ఆ రాజు భాగ్యము కొనియాడ వశముగానిది. అచట శివుని పేరు అళగియ చొక్కనాథ శివుడు.

అగస్త్యమహాముని ద్రావిడభాషకు వ్యాకరణము నిఘంటువు ఛందస్సు, అలంకారము మొదలగునవి వ్రాసెను. వాటిని నిర్మించుటకు ఆ మహాముని 18 బీజాక్షరముల సంపుటిని యొక శంఖాకారపు బల్లపై వ్రాసెను. దానిని పాండ్యరాజుకు యిచ్చెను. ఆ బల్లపై సరస్వతీదేవితో సమానమైన వారెంతమందియైన కూర్చుండుటకు అర్హులు. మీరు వంశ పారంపర్యముగా దీనిని పూజింపుడు అని పాండ్యరాజునకు చెప్పెను. పాండ్యవంశపు రాజులందఱును ఆ శంఖాకారపు పలకను పూజించి కీర్తి ప్రతిష్ఠలనార్జించిరి.

ఈ కథాకాలమునాటి పాండ్యరాజుకి ఆస్థానమున గొప్ప గొప్ప కవులుండెడివారు. వారందఱిలో నత్కీరుడనుకవి చాలా గొప్ప వాడు. ఆ రాజు తన కొలువులోనున్న కవులను మెప్పించినటుల కవిత్వము చెప్పినచో వేయిబంగారు నాణెములిత్తునని ప్రకటించెను.

ఒక యేడు పాండ్యదేశములో పెద్దకరువు వచ్చెను. ఒకరి నొకరు చంపుకొని తినునంతకరువు యేర్పడెను. ఆ మధురానగరమున యొక శివాలయమున్నది. మహాశైవాచార సంపన్నుడైన బ్రాహ్మణుడు ఆ యాలమునకు అర్చకుడు. ప్రతిదినము శివునకు నైవేద్యముగా నిడిన దానిని మాత్రమే యతను భుజించును. ఈ కరువు దినములలో శివునకు నైవేద్యముబెట్టుటకై యేమియును లభింపకుండెను. అతడు తనయాకలి కంటె శివునకు నైవేద్యము లేదేయని మథనపడుచుండెను. కరువు తీరు నంతకు యెచటికైనపోయి కాలముగడిపి, కరువుతీరిన వెనుక మరల రావలె నని యెంచి, ఆ యర్చకుడు యూరువిడచిపోవుటకు సిద్దపడెను.

అంత శివుడు వానికి ప్రత్యక్షమై తమిళభాషలో నొకపద్య మును వ్రాసి యాతని చేతికిచ్చి యిట్లుచెప్పెను. " ఓయి యీ పద్యమును తీసుకొనిపోయి పాండ్యరాజు సభలో చదువుము. అతడు నీకు వేయి బంగారునాణెములను యిచ్చును. వాటిలో యీ కరువు కాలమును గడుప వచ్చును ఇంతలో కరువుదీరును " ఆ శివబ్రాహ్మణుడు సంతసించి ఆ పద్యమును పాండ్యరాజు కొలువునకు తీసుకొనిపోయి [illegible]

చదివి వినిపించెను. ఆ పద్యములో "స్త్రీల యొక్క కొప్పు సహజము గానే సువాసన గలది. అను అర్థము వచ్చు వాక్యముగలదు. అది విని నత్కీరుడు నవ్వి యీ "పద్యము తప్పుపోయ్యె" అనెను. పాపమా యర్చకుడు అవమానముతో శివాలయమునకు వచ్చి శివునితో "స్వామీ! నీమాట నమ్మి నేను వెళ్లితిని. సభలో అవమానపడితిని. ఇదిఅంతయు నాయదృష్టము. నిన్ననియేమి? ఆ నత్కీరుని తప్పుబట్టినయేమి?" అని నిష్టురముగ బల్కెను. "ఓ స్వామి! నీకు శుభము గలుగుగాక. నేను దేశాంతరము పోయెదను కరువు తీరగానే వత్తును" అని చెప్పెను.

అంతట శివునకు కోపము వచ్చినది. నేనే స్వయముగా రాజసభకు వచ్చెదను పదమని శివుడు రాజసభకు పోయెను. "నేనె రాజుపై పద్యము చెప్పగా నత్కీరుడు తప్పు పట్టినాడట! యేదీ తప్పు యెక్కడగలదో చూపించుమని నిలదీసి యడిగెను.

అనగా నత్కీరుడు "తప్పు ముమ్మాటికిని తప్పే. ఆడువారి యొక్క కొప్పు, వాసననూనెలతో, పూలతో సువాసనలు వేయును గాని సహజముగా సువాసనలు గలవికావు. అదియే తప్పు" అనెను. అంతట శివుడు పార్వతికొప్పు సహజ సువాసనాభరితమని చెప్పెను. నత్కీరుడు జగన్మాతయైన పార్వతికొప్పు సహజసువాసనాభరితము కావచ్చును కాని యితర స్త్రీలకు యిది వర్తించదుగాన తప్పే అనెను. శివునకు మిక్కిలి కోపము వచ్చినది. నత్కీరునకు తన ఫాలలోచనమును చూపెను. అంత నత్కీరుడు నీనుదుటి యందేకాదు తలచుట్టూ కన్నులున్నను తప్పు తప్పే యనెను. శివునకు పట్టరానంత కోపము వచ్చెను. నత్కీరుని శపించెను నీవు సర్వాంగముల కుష్ఠవ్యాధితో బాధపడుదువుగాక యనెను.

అప్పుడు నత్కీరునకు భయము కలిగినది. శివుని కాళ్లపై బడి బ్రతిమాలెను. శివుడు వానిని కరుణించెను. కైలాస పర్వతమును దర్శించినచో నీ కుష్ఠవ్యాధి నయమగునని శాపాంతము సూచించెను నత్కీరుడు తన కవితాహంకారమునకు విచారించెను, అందరి కవులవలె నేనెందుకు యూరకుండలేదు అని విచారించెను. ఎక్కడ కైలాసపర్వతము

ఎక్కడ మధురానగరము. శరీరమున కుష్ఠువ్యాధి సోకినతరువాత అసలు నడువలేను. ఆ వ్యాధి పుట్టక ముందే పోవలెనని యనుకొని తీర్థయాత్రలు ప్రారంభించెను.

చెవ్వంది, జంభునాథము వెళ్ళెను, కావేరినిదాటెను. పెన్న గుడ్లకమ్మ, కృష్ణ, గోదావరి, పిఠాపురము, సింహాచలము, శ్రీకూర్మము గోకర్ణము మొదలగు నదులను పట్టణములను దర్శించెను. ఆయా ప్రదేశ ములలోగల స్వాములకు నమస్కరించెను. మెల్లమెల్లగా వాని శరీర మంతయు కుష్ఠువ్యాధి సోకనారభించెను. అతడు నడువలేకుండెను. దేహ మంతయు కుష్ఠువ్యాధితో వ్రణములైనది. శరీరము నుండి చీము నెత్తురు కారజొచ్చెను. ఈగలు ముసరనారంభించెను. అంతట అతడొక యడవిని దాటుచుండెను. అచట అతనికొక రమణీయమైన సరస్సు కన్పించింది. ఆ సరస్సు యొడ్డున యొక మఱ్ఱిచెట్టు యుండెను. అచెట్టు చెలువు విచిత్రము గానున్నవి. ఆ చెట్టు యొక్క ఆకులు నీటిలోబడినవి చేప లగుచుండెను ఒడ్డుపడినవి యాకులు పక్షులగుచుండెను. ఆ విచిత్రమును జూచుచు సత్కీరుడు నిలువబడెను. అంతలో నొక పెద్దభూతము వచ్చి వానిని బట్టు కొనెను. తన గుహలోనికి తీసుకొనిపోయెను. అచట మరికొంత మంది యుండిరి. వారందరుసుభూతముచే బంధింపబడిన వారే. వీరందరిని కలిపి తిందమని ఆ భూతము యుద్దేశ్యము క్రొత్తవాడు వచ్చి చేరినప్పడెల్ల ఆ భూతము అనుకొనిన సంఖ్యపూర్తియగును, వందమంది అయిన వెంటనే ఆ భూతము వారిని తినివేయునని వారందరను భయపడిరి.

నత్కీరుడు సామాన్యుడుకాడు. అతడు కుమారస్వామి భక్తుడు కుమారస్వామినిభక్తిశ్రద్దలతో ధ్యానించెనుకుమారస్వామి ఆగుహాముఖమున యున్న బాతిని తొలగించెను! బందీలనందరిని పంపివేసెను. నత్కీరునితో నీ విచ్చటకు యెట్లువచ్చితివని యడిగెను. సత్కీరుడు తన కథ యంతయు కుమారస్వామికి విన్నవించెను. అప్పుడు స్వామి " శివుడు కైలాస పర్వత మనినాడు గాని హిమాలయములందలి కైలాస మనలేదుగదా దక్షిణ కైలాసమును జూచినచో కుష్ఠువ్యాధి నయమగును. ఇచట విచిత్రమైన

సరస్సులో మునుగుము, నీవు కోరిన చోటికి వెళ్లవచ్చును. అని చెప్పెను నత్కీరుడాసరస్సులో మునిగెను. తిరిగిలేవగానే దక్షిణ కైలాసమయిన శ్రీకాళహస్తిని చేరుకొనెను. స్వర్ణముఖినది కనిపించెను. అతని కుష్ఠువ్యాధి నయమయ్యెను. అపుడతడు అచటి శ్రీకాళహస్తీశ్వరుని, జ్ఞానప్రసూనాంబను నూఱుపద్యములలో పొగడిప్రార్దించెను. శ్రీకాళహస్తీశ్వరస్వామి ప్రత్యక్షమై వానికి శివసాయుజ్యమొసగెను,

91. పద్యభావము సులభము,

92. ఓ శ్రీముఖలింగవాస! నేటి ప్రజలు ధర్మము తప్పినడుచు చున్నారు. స్వార్ధమే వారికి పరమార్థముగానున్నది. ఇతరుల డబ్బుచేజిక్కించుకొనుట యెట్లు అని ఆలోచనలు చేయుచున్నారు ఐహికభోగములే యీనాడు పురుషార్థములుగానున్నవి. పురుషార్థ ములలో ధర్మము, మోక్షము అను వాటిని విసర్జించి అర్థకాము ములే ప్రధానము లక్ష్యములుగా ప్రవర్తించుచున్నారు. మానవత ఋజువర్తనము మచ్చునకైననుగానరావు. ఈ కలి యుగమునందలి ప్రజలను కాపాడుభారము నీదే.

93. ఓ శ్రీముఖలింగవాస! సజ్జనులను దూషించు దుర్మార్గులను పరులపై, లేని నిందలను మోపి ఆనందించువారిని, పరభామల పొందుగోరువారిని, పరులపై చాడీల చెప్పువారిని, పదిమంది వాడుకొను పరిశుద్ధజలములను కలుషితము చేయువారిని తల్లి దండ్రులయొక్క గురువులయొక్క తన కన్నజ్ఞానుల యొక్క దోషములను యెత్తిచూపువారిని, ఘోరమైన రౌరవాది నరక శిక్షలువిధించి, మరుజన్మలో కీటకాదులుగా బుట్టునట్లుచేయుము అట్టివారు పాపభీతిగలిగి సన్మార్గమున వర్తించుటకు అవకాశము గలుగును.

94. ఓ శ్రీముఖలింగవాస! విద్యవంటి ధనము యీ భూలోకమున యేదియునులేదు అక్షయమైన జ్ఞాననిధులను జూపెడి క్రొత్తదైన

అంజనము విద్య (కాటుక) పరదేశములయందు గౌరవమర్యాదలను సమకూర్చెడి బంధువు విద్య. దాయాదులు తమకు పంచి యివ్వమని కోరలేని మహాధనము విద్య దేవతలనైనను మానవులనైనను బుద్ధికుశలతచే ఆకర్షింపగలుగు దివ్యమైన ఔషదము విద్య మనిషి శరీరమునకు యెనలేని కాంతి సంపదను సమకూర్చునది విద్య.

95. ఓ శ్రీముఖలింగవాస! తనకు శక్తిగలుగు మేరకు పాత్రతాదానము, ధర్మము గావించిన భాగ్యము గలుగును. వృద్ధులైన వారిని సేవించిన వినయము, జ్ఞానము, బుద్ధికుశలత గలుగును. అహింసావ్రత ధర్మమును పాటించిన యెడల దీర్ఘాయువు ఆరోగ్యము కాంతి గలుగును. దైవముపై భారమువేసి జీవయాత్ర నడుపువారికి సంసారయాతన సగము తగ్గును. మాటతప్పని ప్రవర్తన మానవునకు సంఘము నందు విలువ పెంచును

96. ఓ శ్రీముఖలింగవాస! ఎంతటిబలవంతునకైనను సమర్థునకైనను ప్రాప్తంలేనిఎడల సంపదలుగలుగవు, అదృష్టం కలసివచ్చినవేళ ప్రాణులను వెదకుకొనుచు సిరిసంపదలు వచ్చిచేరును. వేయివేల ఆయుధములతో మోదినను మరణ ఘడియరానిదే చావుగలుగదు మరణ సమయము వచ్చినయెడల మారణాయుధము లక్కరలేదు గాలితూలి నేలబడి ప్రాణి మరణమొందును. చావుపుట్టుకలు జీవుల ఆధీనములోలేవు. ప్రాణులు జేసుకొన్న పాపపుణ్య కర్మల ఫలితముగా చావుపుట్టుకలు కలుగుచుండును.

97. ఓ శ్రీముఖలింగవాస ! మరణమాసన్న మగునంత వరకు ప్రాణులకు శారీరకసుఖములపై విరక్తిగలుగదు. మమకారములు వదలలేదు. భార్యాపుత్రులు, భూములు, పశువులు, సంపదలు, బంధుజనము అన్నియు తనవేయని నమ్ముచు ప్రవర్తించును తను చూచిన సర్వమును శాశ్వతమనుకొని స్వార్థబుద్ధితో వర్తించుచుం [illegible] రక్తమాంసములు గల ఈ శరీరము శాశ్వతమనుకొని

తన కన్న ప్రియతీతమైన దైవమొకటి గలదను విశ్వాసములేక తిరుగుచుండును. నీ నామ భజన సేయడు వారి అజ్ఞానమును మన్నించి సద్బుద్ధుల నొసంగుము

98. ఓ శ్రీముఖలింగవాస ! నేటి సమాజమును కుల మతములు పాలించుచున్నవి. గాలికి, అగ్నికి, నీటికి కులమున్నదా?(సర్వ మానవాళి అభ్యుదయమునకు యివిదోహదము చేయుచున్నవి) (భూమి జీవరాసులను పోషించుచున్నది) భూమికి కులము న్నదా? శరీరమునందలి రక్తమాంసములకు కులమేది? పాలు ధాన్యము మొదలగు ఆహార పదార్ధములకు కులములున్నదా? సకల చరాచర జీవరాశికి చైతన్యము ప్రసాదించు సూర్యునిది యే కులము. ఈ సుందరమైన ప్రకృతికి యందలి వృక్షము లకు కులములున్నవా? ఈ సృష్టికి అందచందములను సమ కూర్చు పువ్వులకు కులమున్నదా? పరమేశ్వర నీవు యేకులము వాడివి కులములు గొప్పవిగావు. గుణము ప్రధానమైనది, గుణవంతులు, గుణరహితులు అనునవి రెండే తెగలు. అందుచేతనే మహాకవి గురజాడ " మంచియన్నది మాలయైతే మాలనేనగుదున్ " అని పేర్కొన్నాడు. మానవులందరును యొకేకులము మానవకులము. ఈ భావన అందరియందు కలుగునట్లు చేయుము.

99. ఓశ్రీముఖలింగవాస! సంకుచిత స్వబావులైన కులతత్త్వవాదులు మానవత్వమును మంట గలుపుచున్నారు. మతములు వేఱని ప్రేరేపించి స్వార్ధపరులు ప్రజల మతమౌఢ్యమును వ్యక్తిగత ప్రయోజనములకై వాడుకొను చున్నారు. ప్రాంతీయతత్త్వమును ప్రజలలో రెచ్చగొట్టి వారి అధికార దాహములను తీర్చుకొను టకు ప్రజలను పావులను చేయుచున్నారు. స్వార్థము మితిమీరి యితర ప్రాణులను పాపభీతిలేక హింసించు చున్నారు. కుల ములు మతములు స్వార్ధపరులు పన్నినకుట్ర. మానవులంతా

యీ భూమిపై యొక్కటే కులము. అదియే మానవ కులము అదియే నిజమైన మానవత్వము.

100. ఓ శ్రీముఖలింగవాస! నీ రూపముగా భావించుచున్న లింగము కఠినమైన శిల. నీ ధర్మపత్ని పార్వతి కొండల రాయని తనయ. నీ అత్తవారు వారివంక బంధువులు శిలలు. నీ ధనస్సు మేరుపర్వతము శిలయే నీ నివాసస్థలమైన కైలాసమును పర్వతమే. కపాలములు నీ కంఠహారము. పుఱ్ఱె నీ భోజన పాత్ర. నీకు చెందినవన్నియు కఠినమైన శిలలైనను నీవు కరుణా మూర్తివి. భక్తుల మనసులందు నివశించువాడ, మమ్ము యెల్లప్పుడును కాపాడుము.

101. ఓ శ్రీముఖలింగవాస! శ్మశానము నీ విహారభూమి. భిక్షాటనము నీ జీవిక. యేనుగు చర్మము పచ్చిది నీకు అందమైన పైబట్ట శ్మశానములందలి శవముల బూడిద నీకు పైపూత భస్మాసుర బాణాసురాదులు నీ భక్తులు పిశాచగణములు నీ సైన్యవర్గము కాకూటవిషము కంఠమున నిల్పినావు. నీలలాట నేత్రము మండుచున్న అగ్ని. కాని నీవు మాత్రము శివుడవు. శుభం కరుడవు. సన్నుతుడవు. భక్తులపాలిట కల్పవృక్షము నీవు.

102. భావము సులభము.

103. ఓ శ్రీముఖలింగవాస! పాత్రులకు దానధర్మములు గావించి మిక్కిలి కీర్తిప్రతిష్ఠలనార్జించ వచ్చును. మంచి సంతానమును పొంది తోడివారిలో గొప్పవాడనిపించు కొనవచ్చును. పేదలైన కన్యకలకు వివాహములు చేయించి మంచివాడని కీర్తిపొంద వచ్చును. వాపీకూప తటాకములు త్రవ్వించి ప్రజలకు త్రాగు నీటి సదుపాయము కల్పించుట ద్వారా కీర్తినార్జించ వచ్చును. కాని పునర్జన్మలేని ముక్తిపదమునందుటకు నిత్యము త్రికరణ శుద్ధిగా నీ నామపఠనము చేయవలయును.

104. ఓ శ్రీముఖలింగవాస! పండ్లూడిపోయి మాట యేనవచ్చిన దుస్థిత కలుగకుండ, ముసలితనము శరీరమునకు ఆవరించి వేముడు సంప్రాప్తము కాకుండ రకరకములైన రోగములు శరీరమును ఆక్రమించి అశక్తత ప్రాప్తించకుండ భార్యా పుత్రులు సహనము గోల్పోయి శరీరదుస్థితి అసహ్యించుకొను పరిస్థితి యేర్పడకుండ, నేటినుండియే శరీరమున బలమున్నప్పటినుండియే పావనమైన నీ నామ భజననిత్యము గావించి నీ దయపొందగలుగు భాగ్యమును నాకు ప్రసాదింపుము.

105. ఓ శ్రీముఖలింగవాస! కలిగినంత మేరకు లేదనకుండా యితరులను కష్టసుఖములలో నాదుకొను పరోపకారపారీణులైన సాధుజనులు, ఇతరుల ధనములను గడ్డిపోచగా భావించి ధర్మజీవనము సేయునట్టి ధార్మికులు, ప్రతిఫలము నాశించకుండ పరుల సేవయందే నిమగ్నులైన దయాపరులైన సంఘసేవకులు సృష్టియందలి సకలజీవుల హితమునుగోరి తగురీతి ప్రవర్తించు తగవరులు, దైవాంశ సంభూతులు. అట్టివారు నిజముగా నీ యొక్క మూర్తులే. వారి పాదపద్మములకు నేను నమస్కరించుచున్నాను.

106. ఓ శ్రీముఖలింగవాస! సృష్టిలోని సకల జీవరాశులయందు మానవజన్మము మిక్కిలి యుత్కృష్టమైనది. మానవుడు చైతన్యముగలిగి మంచిచెడులను వివేచించగల జ్ఞానసంపన్నుడు ముక్తి పొందుటకు తనశక్తి వంచన లేక ప్రయత్నించును. (తొలుత యౌవ్వనమందు మదించి అహాకరించినను చివరకు దైవమును నమ్మక తప్పదు) వివిధములైన మతములు, మానవులు అనుసరింతురు. వివిధమైన పేర్లతో భగవంతుని భావింతురు. అన్ని మతముల గమ్యస్థానము నీవే. అన్ని పేర్లు నీకే చెందును. ఈ సృష్టియంతట నిండియుండు జీవపదార్థము నీవే యని యెవడు గ్రహించునో వాడె పవిత్రుడు. నిజమైన

జ్ఞాని అతడే.
ఋజువక్రగతులు; మంచినడవడి, చెడునడవడి

107. ఓ శ్రీముఖలింగవాస! సృష్టియందలి నమస్త ధనరాసులకు యధిపతియైన కుబేరుడు నీ చెలికాడు. రత్ననిధియైన సముద్రిని తనయైన మహాలక్ష్మి భర్త పద్మనాభుడు నీభక్తుడు. ఓషదులకెల్ల నిలయమైన హిమవంతుడు నీకు మామగారు. కామధేనువు, కల్ప వృక్షములతో సాటియైన మేరుపర్వతము నీ ధనస్సు అయినను నీవు బిక్షాటనము చేయుదువు. ఇది నీ లీల విలాసము, భక్తుల మైన మాకు ఆయురారోగ్య ఐశ్వర్యములను. ప్రసాదించుము.

108. ఓ శ్రీముఖలింగవాస! గ్రామములకెల్ల తలమానికమనదగు కోమర్తి గ్రామమున బ్రాహ్మణ కుటుంబములో జన్మించితిని. అద్యాపక వృత్తిని చేపట్టి వినయ విధేయతతో శక్తివంచనలేక నిర్వహించుచున్నాను. నీకు సీస పద్యములు దండగా యొక్క శతకమునుగూర్చి భక్తితో యర్పించుచున్నాను. ఈ సీసపద్యముల మాలను యందుకొనుము.

109. ఓ శ్రీముఖలింగవాస! మాధ్వమతానుయాయి, ప్రజ్ఞావంతుడు. ప్రఖ్యాతుడై యొక విశిష్టతగలిగిన గ్రామాధికారిగా పనిచేసిన నరసింగరావు పంతులు నా తండ్రి. కోమర్తి గ్రామ స్త్రీలలో ఖ్యాతిగాంచి తలలోని నాల్కవలె మెలగిన రమణమ్మ నా తల్లి చిన్నతనమునందే తలిదండ్రులను పోగొట్టుకొని అనేకమైన కష్టములను యనుభవించితిని. నీ పరమ కృపాకటాక్షములచే నేటికిని యీస్థాయికి చేరుకొంటిని. నన్ను నిరంతరము కరుణతో రక్షింపుము.

110. ఓ శ్రీముఖలింగవాస! ధీమంతులైన రామదాసు కిష్టప్పలు నా అగ్రజులు అందు పెద్దయైన రామదాసు అసమాన ప్రజ్ఞావంతుడు ప్రస్తుత బొంబాయినగరవాసి, కార్మిక జనసేవలో ఆచట నివాస

మున్నవారు. గ్రామాధికారిగా పనిచేసిన రెండవ సోదరుడు అకాల మరణము జెందెను. ఓపరమేశ్వర! మా కుటుంబసభ్యుల నందఱిని యెల్లప్పుడును చల్లగా కాపాడుము.

111. ఓ శ్రీముఖలింగవాస! కీర్తిశేషులు జగనాథ్నస్వామిగారు చొప్పలి వంశమునందుదయించిన జ్ఞాన భాస్కరుడు, వారి పాదయుగము నకు నమస్కారములు చేయుచున్నాను. ఆ మహనీయుడు నన్నొక వ్యక్తిగా మలచినవారు. ఇక గంటి నరసింహశాస్త్రీగారు బృహస్పతి సమానులు. ఆయనకు నమస్కారములు. తెలుగుభాషపై హైస్కూలు చదువునందే అభిలాష కలిగించి ఆభాషాభ్యసనము నకు దోహదము చేసినారు. ఈ అదిగురుమూర్తులను వారి వంశములను రక్షింపుము.

112. ఓ శ్రీముఖలింగవాస! మహాకవి కర్రి సుబ్బారావుగారు నేడు కీర్తిశేషులు, నాకు పద్యములల్లగల విద్యను నేర్పినారు. మహా పండితులు, మహాకవులు బంకుపల్లి వంశచంద్రుడైన సూర్యనారాయణశాస్త్రీగారు నాకు రాఘవ పాండవము ద్వర్థికావ్యము చెప్పినారు. వారి సోదరులు సర్వకళాప్రవీణులు విమర్శకులు కవులు శ్రీలక్ష్మణశాస్త్రీగారు అమరకోశమును రఘువంశమును నాకు జెప్పిరి. వారిని యెల్లవేళల ఆయురారోగ్యములిచ్చి కాపాడుము.

శ్రీముఖలింగేశ్వర శతకమను శివమహిమ యందలి లఘుటీక తాత్పర్యములు, సంబంధ పురాణకథలు సమాప్తము.

